# "ప్రపంచీకరణ ప్రతిధ్వని"

## (కవితలు, పాటల సంకలనం)

సంపాదకుడు:

డా॥ ఎస్వీ సత్యనారాయణ




విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్

విజ్ఞాన భవన్, 4-1-435 బ్యాంక్ స్ట్రీట్

హైదరాబాద్-500 001.

PRAPANCHEEKARANA PRATHIDWANI
*Edited by* **Dr. S.V. Satyanarayana**

విశాలాంధ్ర ప్రచురణాలయం (1953-2003) స్వర్ణోత్సవ ప్రచురణ

ప్రచురణ నెం. : 2350/2

ప్రతులు : 1000

ప్రథమ ముద్రణ : మార్చి, 2003

వెల: రూ.40-00

ప్రతులకు: విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్,
విజ్ఞాన్ భవన్, అబిడ్స్, హైదరాబాద్-500 001.
E-mail visalaandhraph@yahoo.com
విశాలాంధ్ర బుక్ హౌస్,
(అబిడ్స్, సుల్తాన్‌బజార్) హైదరాబాద్,
విజయవాడ, విశాఖపట్నం, గుంటూరు,
తిరుపతి, హన్మకొండ, అనంతపురం, కాకినాడ.

ముద్రణ: విశాలాంధ్ర ప్రెస్. హిమాయత్‌నగర్, హైదరాబాద్.

# మామాట

ఇది ప్రపంచీకరణపై తెలుగుకవుల ప్రతిస్పందన. దాదాపు దశాబ్దకాలంగా సరళీకరణ, ప్రపంచీకరణ, ప్రైవేటీకరణల దుష్ప్రభావాలపై తెలుగుకవులు, రచయితలు తీవ్రంగా స్పందిస్తున్నారు. ప్రతిభావంతమైన కవితలు, పాటలు, కథలు, నవలలు రచిస్తున్నారు. కళారూపాలను సృష్టిస్తున్నారు.

ప్రపంచవ్యాప్తంగా సామ్రాజ్యవాద ప్రపంచీకరణ విష ప్రభావాలను నిరసిస్తూ ప్రజలు, ప్రజాసంఘాలు, రాజకీయ పార్టీలు వివిధ పోరాట రూపాల ద్వారా ఉద్యమిస్తున్నారు. బలమైన గళగర్జనలు వినిపిస్తున్నారు.

ఈ పూర్వరంగంలో 'ప్రపంచీకరణ ప్రతిధ్వని' పేరిట ఒక కవితలు, పాటల సంకలనాన్నీ, ఒక కథానికల సంకలనాన్నీ వెలువరించాలని విశాలాంధ్ర ప్రచురణాలయం సంకల్పించింది. వివిధ దినపత్రికల్లోనూ, 'పత్రిక' (సాహిత్యపత్రిక)లోనూ, 'అభ్యుదయ' (బులెటిన్)లోనూ ఈ విషయమై ఒక ప్రకటన వెలువడింది. రాష్ట్ర వ్యాప్తంగావున్న కవులు, కవయిత్రులు, రచయిత(త్రు)ల నుండి అనూహ్యమైన స్పందన లభించింది. వందలాది రచనలు మాకు అందాయి. గ్రంథ విస్తరణభీతిచేత ఇదిగో ఈ మేరకు రచనలతో ఒక సంకలనాన్ని ప్రకటిస్తున్నాం. సాహితీమిత్రుల నుండి పాఠకుల నుండి లభించే ఆదరణనుబట్టి మరో సంకలనం వెలువరించే ప్రయత్నం చేస్తాం.

మా ప్రకటన చూసి స్పందించిన రచయితలందరికీ, ఈ కవితల్లో కొన్నింటిని ప్రచురించిన పత్రికాధిపతులకూ; గ్రంథ రూపకల్పనలో సహకరించిన ఆత్మీయ మిత్రులు జ్వాలాముఖి, వర్ఝుల శివకుమార్, గేరా సురేశ్‌బాబుగార్లకు హృదయపూర్వక కృతజ్ఞతాభివందనాలు.

07-02-03 — డా॥ ఎస్వీ సత్యనారాయణ

హైదరాబాద్ — (సంపాదకుడు)

# ఇందులో...

## కవితలు


| | | | |
|---|---|---|---|
| 1. | అనిసెట్టి రజిత - గ్లోబల్ లవ్ | .. | 1 |
| 2. | అన్నవరం దేవేందర్ - కత్తి | ... | 3 |
| 3. | అరసవిల్లి కృష్ణ - దర్జీవాడు | ... | 4 |
| 4. | అరుణ్ బవేరా - డాలర్ రుతువు | ... | 5 |
| 5. | ఆశారాజు - ఉరితాడు | ... | 6 |
| 6. | ఉదారి నారాయణ - ఏమీ కానప్పుడు | ... | 8 |
| 7 | ఎస్.ఆర్. భల్లం - డాలర్ వలలో కొల్లేరు | ... | 9 |
| 8 | డా. ఎస్వీ సత్యనారాయణ-ఇదీ నేటి ముఖచిత్రం | .. | 11 |
| 9 | ఏలేశ్వర నాగభూషణాచార్య - రంధిగాయం | | 14 |
| 10. | ఏ.వి ఆర్.మూర్తి - వెంటాడే పీడకల | . | 16 |
| 11. | ఒబ్బిని - 'వియ్యారెస్' ఉత్తరం | | 17 |
| 12 | డా॥ కలువగుంట రామమూర్తి-గ్లో'బలై'జేషన్‌కు 'బలై'పోకు... | | 19 |
| 13 | కందుకూరి శ్రీరాములు - పాదం | .. | 22 |
| 14 | కె ఉషా సరస్వతి - బీజ సంహారం | .. | 24 |
| 15 | కొండేపూడి నిర్మల - జీవితం వర్సస్ ట్రూప్ బజార్ | .. | 26 |
| 16. | కొత్తపల్లి ఉదయబాబు - డాలర్ ఖడ్గం | ... | 29 |
| 17 | కోట్ల వెంకటేశ్వరరెడ్డి - ప్రపంచీకరణ ఒక నినాదమే! | ... | 30 |
| 18. | కోసూరిగాంధీ - డాలరు | ... | 31 |
| 19. | కోసూరి రవికుమార్ - ఎర్ర జీరలు | ... | 33 |
| 20. | గేరా - కొత్తదేవుడు | ... | 35 |
| 21. | ఘంటశాల నిర్మల - రంగుల చీకటి | ... | 37 |
| 22 | చింతల దేవేందర్ - జాతీయ జండా | .. | 39 |

23 చిమ్మపూడి శ్రీరామమూర్తి - తప్పదు మరి .. 40
24 జి ర్ కుర్మే - గారడి ఆట 41
25 జొన్నవిత్తుల రామలింగేశ్వరరావు -
కోతి మూత్రానికి పేటెంట్ వద్దా? 42
26 జ్వాలాముఖి - డాలర్ దేగ . 45
27. టి ఎం.ఆర్ రమణారెడ్డి - గ్లోబల్ హైకూ ... 48
28 టి కృష్ణమూర్తి యాదవ్ - జాగ్రత్త బక్కరైతులు . 49
29 డి శ్రీదరాచార్య - తెలంగాణా 'బక్క' రైతు 52
30 తుమ్మల దేవరావ్ - బుల్లితెర 53
31 త్రైదల అంజయ్య - హ్యూమన్ ఫర్ సేల్ డాట్ కామ్... 55
32 దాట్ల దేవదానం రాజు - వికార రూపం .. 57
33 దార్ల రామచంద్ర - స్వాహతంత్రం . 59
34 డా॥ దిలావర్ - ఒక నిశ్శబ్ద జ్ఞాపకం .. 61
35 డా॥ నసుమాసస్వామి - హతాబ్దం .. 63
36 నందిని సిదారెడ్డి - బహు(ళ) దాహం 66
37 నాళేశ్వరం శంకరం - కరెన్సీ ఖడ్గం! 69
38 పరిమళ్ - పరుచుకుంటున్న వల . 72
39 పి అనంతరావు - అగ్నిశ్వాస .. 74
40 పి ఆర్ ఎల్. స్వామి - అతలాకుతలం ... 75
41 బత్తుల వీ వెం.అప్పారావు -
మనకిప్పుడు ఏ "విలువ"లూ లేవు ... 76
42 బద్ది నాగేశ్వరరావు - భవితకు గొడ్డలిపెట్టు!! ... 77
43 బి.ఆర్. భగవాన్‌దాస్ - ఒక్కటౌదాం మనం ... 78
44. భగ్వాన్ - పొల్లుగింజ ... 80
45. డా॥ మానేపల్లి - ముఖ ముఖాలు .. 82
46. డా॥ మిరియాల రామకృష్ణ - సృష్టికర్తకో ఉత్తరం .. 83
47. యస్ మునిసుందరం - ఇదేందబ్బా! .. 85
48. రవి కుమార్ - ప్రపంచీకరణ - పెనురక్కసి ... 87

49. రసరాజు - ఆలోచించు ... 88
50. రాధేయ - ఎడారి వసంతం! ... 91
51. డా॥ రాపోలు సుదర్శన్ - కలలు కందాంరా! ... 94
52. డా॥ వర్ఝుల శివకుమార్ - భ్రమావరణాలు ... 96
53. వి.ఆర్.రాసాని - ఇంకేముందనీ ... 98
54. వేల్పుల నారాయణ - మార్కెట్ మహమ్మారి .. 100
55. శేషం సుప్రసన్నాచార్యులు - అనాథ ... 102
56. శ్రీదాస్యం లక్ష్మయ్య - తస్మాత్ జాగ్రత్త ... 103
57 షేక్ కరీముల్లా - నిరసన జెండా ... 105
58 సలీం - నాటకం ... 107
59. సుదేరా - స్వేదవిస్ఫోటనం ... 108
60. సోమేపల్లి వెంకటసుబ్బయ్య - సైబర్ మేఘాలు ... 111

## పాటలు

1. అమెరికోడొస్తుండో - గద్దర్ ... 115
2. పల్లె కన్నీర్ఱు - గోరటి ఎంకన్న ... 118
3. హైటెక్ గీతం - డా॥ ఎస్వీ సత్యనారాయణ ... 121
4. పూల పూల తోట లోపల - నందిని సిధారెడ్డి ... 123
5. జిమ్మేదారికోయిలా - భూపాల్ ... 125
6. బహుళజాతి పెట్టుబడి - నిస్సార్ ... 127
7. అన్నదాత ఆత్మహత్యలు - పిడుగు ఎంకన్న ... 129
8. హైటెక్ మాయలేడి - సదాశివుడు ... 131
9 గొంతు కోస్తున్నారు - జాకబ్ ... 133
10. విషాద గీతం - రవిశాస్త్రి ... 135
11. కాకలు తీరిన కార్మికులారా! - చైతన్యప్రసాద్ ... 137



అనిశెట్టి రజిత

# గ్లోబల్ లవ్

లవ్ లవ్ లవ్‌మీ అంటూ
పిలుస్తున్నదండీ మార్కెట్ మాయాజాలం
రా రమ్మని కవ్విస్తుందండీ వస్తు వ్యామోహం
వ్యాపార లాభాలకు కొత్త కొత్త ఊరింపులు
సరుకుల అమ్మకానికి చచ్చురకం పోటీలు
వినియోగనీయమా కాదాన్నది అప్రస్తుతం
ఇల్లంతా వింత సామాన్లతో నింపేయడం ఆధునికం.

యంత్రాల నడుమ ఇరుక్కున్న మనిషి
అదే గొప్పని ఫోజిస్తూ
అదే సుఖమని భ్రమిస్తూ
మరుగుజ్జు రోబోవలె మసలుకోవడమే
నేటి గ్లోబల్ ఫ్యాషన్.

ప్రపంచం ఒకే కుటుంబంగా కుదింపబడుతున్నది
విశ్వీకరణ శరవేగంగా జరుగుతున్నది
అంతా ప్రైవేటే
నిత్యావసరాలన్నింటిపైనా వేటే
గ్లోబల్ లవ్‌లో పడ్డమనిషి
తల్లకిందులుగా వేల్లాడుతూ
గ్లోబంతా తిరిగొస్తున్నాడు
తోటి మనుషుల్ని ప్రేమించడం మర్చి
బిగదీసుకుపోతున్నాడు.

పల్లెలూ పచ్చదనాలూ మాయం
స్టార్ టీవీల సకిలింపుల్లో
పలకరింతలు యాంత్రికం
ప్రకృతి వనరులస్థానే ప్లాస్టిక్ వాడకం
లవ్‌లన్నీ మార్కెట్ లవ్‌లే
నవ్వులన్నీ మర్మగర్భితాలే
రాక్షసోత్పత్తులన్నీ రా రమ్మని పిలిచే అహేతుకాకర్షణలే.

రోడ్లన్నీ వెడల్పవుతుంటాయి
దూరాలు తరిగిపోవాలనే
సునాయాసమయిన ప్రయాణాలు,
సరళీకృతమైన విదేశీయానాలు
బంధుత్వాల పరామర్శలకు కాదు
వ్యాపారాల విస్తరణలకోసమే.

శ్రమను అస్థిరం జేసి
స్థానిక ఉత్పత్తులను తేలగొట్టి
ఎక్కడివారి సంస్కృతినీ కళలనూ అక్కడే ఛిద్రంజేసి
దేహాల తళుకు బెళుకులే ప్రధానం సుమా
జీవితమంటే ఏ విలువలూ లేని
విచ్చలవిడి ఆటవిడుపులనే
వెర్రి జాడ్యాలతో అంటకాగడం
ఆకర్షణగా గ్లోబల్ లవ్వంటే
గ్లోబల్ వైరస్ సోకినట్లుగా
అది నిజంగా మనిషితనాన్నే
హరించడమా!?



## అన్నవరం దేవేందర్

# కత్తి

పార్ధీనియం మొక్క విస్తరించి విస్తరించి
ప్రాణవాయువులో విషం చిలికినట్లు
ప్రపంచీకరణ ఎల్లెడలా ప్రాణగండమైంది
సరళమైన దోపిడికి 'సరళీకరణ' రంగు పులిమి
వ్యాపార కత్తికి 'సంస్కరణ' తేనె పూశావు
నిఖార్సయిన వ్యాపార గుళికకు
చక్కని చక్కెర పూతే ప్రపంచీకరణ
వ్యాపార సామ్రాజ్యం కోసం
రెక్కలు కట్టుకొని వాలిన తెల్లదొంగలకు
జమోరిన్ చక్రవర్తినుంచి పివినరసింహుని దాకా
సాగిలపడి స్వాగతం చెప్పినవారే
'ప్రపంచ కార్మికులారా ఏకం కండి' నినాదం.
బూడిదలో పోసిన పన్నీరై
ప్రపంచ బహుళజాతి కంపెనీల ఐక్యతగా మారింది
రోబాట్‌లు, కంప్యూటర్లకు ప్రాణాలొచ్చి
నిండు కుటుంబాలకు ఉరితాళ్ళు వేస్తున్నాయి.
మంచినీళ్ళు అందిచ్చే మా సాంప్రదాయం
నీకు వ్యాపారమై బంగారుగుడ్లు పెడుతుంది
నీళ్ళను వ్యాపారం చేసినవాడివి
రేపు గాలినీ ప్రేమనూ సంస్కరిస్తావా?



## అరసవిల్లి కృష్ణ

# దర్జీవాడు

వాడు!
అస్థిపంజరానికి తొడిగిన, చొక్కాలా కనబడతాడు.
గుండెలకు అనిన గుడ్డ తెరతీస్తే
ఎక్సరే ఫ్రేములో దాగిన ఎముకల గూటిలా కనిపిస్తాడు.
ఈ ప్రపంచానికి, సిగ్గుతెర కట్టాడు.
బొమికలతో నిండిన దేహానికి కాసింత సౌందర్యాన్ని అతికాడు
సన్నని పీలికలాంటి కాళ్ళతో లక్షలాది కుట్లు వేశాడు.
చెమట చుక్కలతో స్నానించి ఆకలి దుఃఖాన్ని జారవిడిచాడు.
మళ్ళీ మొలకెత్తిన రెండు నయనాల
మధ్య నుండి చినిగిన వస్త్రాలకి మాసికలేశాడు.
సామూహిక ఆత్మహత్యల దారిన పోకుండా.
ఒక్కో ఆత్మహత్య దగ్గర, కాసేపు ఆగాడు.
వాడి, మరణవార్త దినపత్రికల చెవికి చేరదు.
మౌనంగా మృత్యువును అందుకుంటూనే ఉన్నాడు.
మఖమల్, జాకెట్ల మధ్య పీటర్ ఇంగ్లాండు స్లాకుల మధ్య
అమెరికా ట్రౌజర్స్ మధ్య జీవిక అర్థంకాని, పజిల్.
ఖోరున కురుస్తున్న, అధునాతన దుస్తుల ముందు
ఆకలి కేకలతో నిలబడ్డాడు.
సుందరీమణుల డ్రెస్ డిజైనర్ల కలల సీధం దగ్గర,
సరళీకరణ మంత్రాన్ని ద్వేషిస్తూ. తన చేతుల్లో దాగిన పనితనాన్ని.
తనదయిన సూర్యోదయం కోసం దాచుకున్నాడు.



అరుణ్ బవేరా

# డాలర్ ఋతువు

జీవితం అనేక ముఖాలుగా విడిపోయింది.
నానించి నేను పరిగెడుతున్నాను. దూరంగా
నా బంగారు మట్టినించి,
ఉన్న వూరునించి, కన్న పేగునించి,
ఎటేపెళ్ళినా నాదేహం నన్ను వెంబడిస్తోనే వుంది.
జీవితాన్ని శరీరానికి కట్టుకుని లాగుతున్నాను.
నా దేహాన్ని ఈ దేశమంతా పరిచాను.
అయినా రూపాయి
డాలరంత అందంగా ఎప్పుడూ కనిపించలేదు.
లేప్‌టాప్‌లో లోడ్‌చేసిన శరీరం,
ఒక వీసా విమానపు ఖర్చుతో చాలు
సాఫ్ట్‌వేర్ సామ్రాజ్యం అందుకోడానికి.
కలలపంట - డాలర్ రుతువు,
రెండు చేతులా ఎన్నెన్ని, డాలర్లు పూస్తుందో!
యిక స్వదేశపు కరెన్సీ చౌకబారుతనం నించి దూరం దూరం....

కార్లూ విలాసాలూ మర్యాదలూ భవంతులూ
ఖరీదైన బట్టల రాపిడీ...
ఏడాదికి ఒకటో ఆరో ఇండియా ప్రయాణం,
ఇప్పుడు - కంప్యూటర్ గురించో కొత్త ప్యాకేజీ గురించో
కొత్త కంపెనీ జీతం గురించేతప్ప
నా రాజ్యాంగంలో మరో ప్రస్తావనకి చోటేలేదు.



ఆశారాజు

# ఉరితాడు!

ఇలా వుంటుందనుకోలేదు
ఉరితాడు
ఇంత అందంగా వుంటుందనుకోలేదు
ఒకర్నుంచి ఒకర్ని వేరుచేసి
ఇంటినిలా శ్మశానం చేస్తుందనుకోలేదు
అందరం ఒకే ఇంట్లోనే వుంటాం
పక్కపక్కనే కూర్చోనున్నా
ఒకరితో ఒకరం మాట్లాడుకోలేం
ఇల్లంతా పరుచుకుంటున్న రంగుల్లో
ఊపిరాడక మునకలేస్తుంటాం
ఇలా వుంటుందనుకోలేదు
ఉరితాడు
ఇన్ని రంగుల్లో వుంటుందనుకోలేదు
ఆలోచించనివ్వదు
చూపుని పక్కకు వాలనివ్వదు
కళ్ళనిండా ముసురుకునే భ్రమలు
అడుగడుగునా వెలసే మయసభలు
ఇలా వుంటుందనుకోలేదు
ఉరితాడు
ఇన్ని ఎపిసోడ్లుగా ఉంటుందనుకోలేదు
పిల్లలు కలలు కనటం మరిచిపోయారు
స్వంతంగా నవ్వటం మానేశారు

గొంతుకి, సూపర్‌హిట్ ముఖాబిలాలూ సరిగమలు
టాప్‌టెన్నులూ తరానాలూ బిగుసుకుని
దినమంతా గిలగిలా కొట్టుకుంటున్నారు
ఇలా వుంటుందనుకోలేదు
ఉరితాడు
ఇన్ని ఛానెల్సులో వుంటుందనుకోలేదు
ఇల్లు పిచ్చివాళ్లు తిరిగే ఎడారయ్యింది
అందరం దృశ్యాన్ని చూస్తూ
మసక వెల్తుర్లో ఉరి తీయబడుతుంటాం
ఇలా జరుగుతుందనుకోలేదు
ఉరితాడు
మా ఇంట్లోనో వేళ్లాడుతుందనుకోలేదు.



డా॥ ఉదారి నారాయణ

# ఏమీ కానప్పుడు

నెత్తురే కాదు మనసూ గడ్డకడుతుంది
నీటిముత్యం రాలేలోగా నేత్రం వర్షకవాటం తెరుస్తుంది
పగలు బలవంతపు బతుకుక్రీడ
రాత్రి సొమ్మసిల్లిన గాయాల లేడి
శ్వాస పరాధీనమైనప్పుడు మనసూ, మాటదేముందీ
శూన్యంలోంచి సహస్ర రక్షణ హస్తాలు
స్వప్నం పగిలేలోగ గాలాలపొది
రగులుతున్న దేహానికి
రంగులవల లోకం ఉపశమనం
'రోబోట్' కాలమిది
మమతలూ, మర్యాదలూ
హత్తుకోవడాలూ, గుక్కపట్టడాలూ
చెత్తకుండీ పక్కన ఆడుకుంటున్న పాలిథీన్ కవర్లు
వేప చేదుగా లేదూ!
ఓహో పేస్ట్ తియ్యగుంది
కుండ నల్లగున్నదా!
మినరల్ వాటర్ బలేగమ్మత్తు
గోచీ తాతయ్య ఉపన్యాసాలకే...
నీ నీడలో నువ్వే ఉన్నా
నీ కాళ్లతో నువ్వే నిల్చున్నా
తరుగుతున్న పచ్చదనం
పరాయవుతున్న అస్తిత్వం
బతకాలి బతకాలి నీ కోసం కాకున్నా ...
బతకాలి బతకాలి మనిషిలా లేకున్నా...

**ఎస్. ఆర్. భల్లం**

# డాలర్ వలలో కొల్లేరు

నేలని గోలిగా మార్చే
డాలర్ బూచీ చాలు
కొల్లేరు కొంప ముంచడానికి...

ముంపు నీటినుంచి మొలచిన కళ్ళలో
కాడిపట్టిన మట్టి కలల్ని
కన్నీటిపాలు చేయడానికి....

కొల్లేటి దేహాంగాల్ని
అప్పుల చేతుల్లో పెట్టినప్పుడే
డంకెల్ బ్రీడ్ ఫిలాసఫీతో
నీటి గోడమీద బతుకు వస్త్రం చినిగి
ఆకలి పేగుల వలగా మారిపోయింది

కాగితపు పులిగాడి కోరల్లో
తొంగి చూస్తున్న ధూళి దూసరితపు
హాహాకారాల సంతకాలతో
మట్టి నోళ్ళ కొల్లేటి పక్షులే-
మినహాయింపులేని విషాదపు సాక్షులు

వలల్నీ మావుల్నీ విడువని
చపలత్వపు జల పుష్పాల దివాలాకోరు తనంలో
నిమ్మళించని పశ్చాత్తాపంతో
మొత్తని నెత్తురు సెగ

తేట నీటి మానంలో
బహుంళజాతి దృశ్యమాలిక ప్రతి ఫలిస్తుంటే
కొల్లేటి బానకడుపులో
పురుడు పోసుకోని కాలుష్యపు పూనకం చప్పుడు

ఎవరు బాదారో
డాంబికపు డాలర్ ఫేం బెత్తంతో
కొల్లేరు వొళ్లంతా కాలుష్యపు మచ్చలు

తుంగమొక్కల అంచున వేలాడ్తున్న
కొల్లేటి కష్టల దృశ్యాన్ని తట్టిలేపి
శుద్ధి చేసే ధైర్యం ఎవరికుందో...!?
కాలుష్యపు చీకటిలో తడిసిన-
కొల్లేరు వెలుగు రేఖల్ని ఎలా ప్రసరిస్తుందో...!?!

ఇప్పుడు
డాలర్ తూటా తగిలిన గూడకొంగ కొల్లేరు
ఇప్పుడు
జవసత్వాలు జప్తు కాబడ్డ బొమికల బొమ్మ కొల్లేరు.



డా॥ ఎస్వీ సత్యనారాయణ

# ఇదీ నేటి ముఖచిత్రం

ఇక్కడ మనిషికి గౌరవం ఉండదు
మనస్సుకు స్పందనా ఉండదు
ఊహాలూ ఉద్వేగాలన్నీ సెల్యూలాయిడ్ పై విహరించాక
గుండె గొంతుకల కలయికా, కదలికా
నిన్నటి మాటగానో, నీటి మూటగానో జారిపోతుంది-
ఇప్పుడు అన్ని సంబంధాలూ మార్కెటీకరింపబడ్డాక
సన్మాన సత్కారాలూ అవార్డు రివార్డులూ అధికారపీఠాలూ
అంగట్లో సరుకులై ఆకర్షిస్తుంటాయి
ఇంక ఏ కొదువా ఉండదు
సభా సమ్రాట్టులు మొదలు సంఖ్యా శాస్త్రజ్ఞుల దాకా
వేదికల విస్తీర్ణం పెరిగిపోతూనే వుంటుంది-
ఇక్కడ అన్ని మూల్యాలూ పతనమైపోయాక
ఇంకిపోతున్న అశ్రుకణాలు నిట్టూర్పులై ఎగిరిపోతుంటాయి-
రాత్రికి రాత్రి ఒక అనామకయువతి
'ఉమన్ ఆఫ్ ది ఇయర్'గా
పత్రికల్లో పతాక శీర్షికై ప్రత్యక్షమౌతుంది
శంఖుస్థాపనల నుంచి ప్రారంభోత్సవాల దాకా
ఖరీదైన పట్టుచీరై విస్తరిస్తుంది
ప్రఖ్యాత కవుల అక్షరాలు ఆమె ప్రశంసాపద్యాలై
ఒదుపుగా ఒదిగిపోతుంటాయి
పత్రికలు ఆమె జీవితకథలై 'పారు'తుంటాయి-
నిన్నటిదాకా ప్రతిపక్షానికి ఉధృత గళగర్జనై మోగిన వీరనారి

నేడు అధికారపక్షంలో వినయంగా ఒదిగిపోతుంది
మొన్నటి సాయుధ పోరాట ఇతిహాసంగా వెలిగిన వీరయోధుడు
ఉన్నట్లుండి నేడు బూటకపు వాగ్దానాలకు మురిసిపోతూ కరతాళ ధ్వనిగా
మిగిలిపోతాడు
నిన్నటిదాకా అవతలి పక్షంలో నారద తుంబురులై బాకాలూదిన
వీణానిక్వాణాలు
నేడు ఉన్నట్లుండి ఇవతలి పక్షంలో
ప్రతిధ్వనించే ఢమరుకలై మార్మోగుతుంటాయి-
ప్రచార సాధనాల పద్మవ్యూహంలో
ప్రతిదానికీ ఖరీదుకట్టే షరాబులదే పైచేయి-
విద్య, వైద్యం, ఉద్యోగం... ఒకటేమిటి
ప్రజా సంక్షేమ కార్యక్రమాలన్నీ ప్రైవేటీకరింపబడుతుంటాయి
విద్యుత్ తీగలపై సామాన్యుడి సంపదంతా ఉరితీయబడుతుంది
మంచినీటిని నమ్ముకున్న చేపల్ని మొసళ్ళు వేటాడం మొదలెడతాయి
ఇక్కడి ప్రణాళికలూ, ప్రాజెక్టులన్నీ
ఏడేడు సముద్రాల అవలి దోపిడిదారుల పచ్చ జెండాకై పడిగాపులు
పడుతుంటాయి
రాజ్యమూ రాజ్యయంత్రాంగమూ సచివాలయ శాసనసభలూ
నిజాన్ని వినకుండా చూడకుండా చెప్పకుండా
మూడు కోతుల బొమ్మగా ముడుచుకుపోతాయి-
పత్తిరైతుల ఆత్మహత్యలపై క్రీడా మైదానాలు మొలుస్తాయి
ఆర్థిక సంక్షోభాలను మరిపించే అంతర్జాతీయస్థాయి స్టేడియంలు
వెలుస్తాయి
రాష్ట్ర రాజధానిని జీవితంలో మొట్ట మొదటిసారి సందర్శించే
అండమాన్ నికోబార్ దీవుల అనాథ క్రీడాకారిణి
స్వర్ణాంధ్రదేశం మెడలో బంగారు పతకమై వేలాడుతుంది
ఇక్కడ....
అవినీతే నీతిశాస్త్రాలు వల్లిస్తుంది

అధర్మం ధర్మరక్షణకై పేటెంట్ హక్కులు సంపాదిస్తుంది
ఆరోపణలు అందలాలు నధిరోహిస్తాయి
ప్రలోభాలు పోరాట చైతన్యాన్ని నీరుగారుస్తాయి
పదవుల పంపకాలే ప్రజాసేవకు పరమార్థాలౌతాయి
హింస శాంతి ప్రబోధాలు ప్రవచిస్తుంది
కాల్పులు ఎదురుకాల్పుల అందమైన కథన రూపం ధరిస్తాయి
నిన్నటి అమరవీరుల త్యాగాలు చరిత్రలై గ్రంథాలయాల్లో దాక్కుంటాయి
ఆదర్శాలు నిఘంటువుల్లో అర్థాలై భద్రపడతాయి
ఇదంతా జనజీవన స్రవంతిగానే నిర్వచింపబడుతుంది-
ఇప్పుడు...
రాజ్యాంగం రోజూ మానభంగానికి గురవుతుంటే
ప్రపంచ బ్యాంకుదే పెత్తనమంతా
ప్రజాస్వామ్యం పరిహాసం పాలవుతుంటే
అప్రజాస్వామిక శక్తులదే పాలనంతా-



## ఏలేశ్వర నాగభూషణాచార్య

# రంధిగాయం

గుండెలదిరిన రంధిగాయం మానదు
హృదయ పుష్పం పుష్పించనే పుష్పించదు
నవ్వుల సవ్వడి అలల ముఖాలు ముఖులించనే ముఖులించవు
తోవ పక్క తుమ్మ చెట్టు చిలిపాకునీడకింద
నేను.... మిగిల్చుకున్న జ్ఞాపకాల వేడి కుంపట్లు మాత్రమే....
ఒంటరి ప్రయాణంలో
బాల్యపు జ్ఞాపకాల బొమ్మరిళ్ళను దేవులాడుకుంటూ
పుట్టినఊరు తాతలనాటినుండి విత్తుతున్న
జొన్న పిశ్శిల్ల పాలపుంతల్లో పెరిగిన
ఆనవాళ్ళ పుటలను గాలించుకుంటూ
ఏకాకిగా ఎడారిగాని ఎడారిలో
ఊపిరి సలుపుకుంటూ తిరుగుతున్నవాణ్ణి
నాగటి కర్రుమొనతో దున్నాల్సిన భూతల్లి నొసలుమీద
నల్లనాగులా తార్రోడ్డు మొలకెత్తింది
నాగలి జాడలేకుండా నొగలు వంగిపోయాయి
ఊరుకుఊరు కంప్యూటర్ చెక్కిళ్ళపొరల్లో బంధించబడి
రక్కసి ఫ్యాక్టరీలకు సరికొత్త ఆవాసాలుగా మారుతున్నాయ్
పచ పచ్చని పైరు పంటల జాడ అమాంతం నీటి తుంపరలా
ఆవిరైపోయి ఆకాశాన్ని అలుముకొన్న ఆనవాళ్ళు
ప్రపంచీకరణ రాక్షసిబల్లి కాటుకు పల్లెలన్ని బూడిదైపోయాయి
గ్లోబలైజేషన్ గొడ్డలి పెట్టులో ఊరువాడలన్నీ
నగతాలనిండా నాపల్లె చెరువు తెల్ల దుబ్బటిలా విస్తరించి పోతున్నాయి
ఇవాళ నా ఊరెక్కడ.... నా వాడెక్కడ... నేనెక్కడ

పరాయీకరణ మాయా మార్కెట్‌లో పరాయినై
పనికిరాని వాణ్ణై పసలేని వాణ్ణై భూమిచుట్టూ తిరుగుతున్నవాణ్ణి
నాగూర్చి నా అనవాళ్ళ పొక్కిళ్ల గూర్చి ఏ పోలికల్ని ఎగజల్లను
ఏ ఆకారాలను అరచేతి అద్దంలో చూపించను
పేదరైతన్నల భూతల్లి చేతులమీంచి సబ్బులాజారి
బడాబాబుల హస్తాల మంగన్‌లో బందీ అయింది.
భూతల్లి కన్నీటిధార భరించలేని జనం
అతలాకుతలమై ఆగమాగమై ఎదపై లబోదిబో గుద్దుకుంటున్న
కుంపటి గువ్వల్లా రైతన్నల దృశ్యం
ప్రపంచీకరణ పటంలో నలుగుతున్న జీవితాలు
పచ్చలు పచ్చలుగా పగిలిన అద్దంలా దర్శనమిస్తున్నాయి
మనకు మనం మిగలకుండానే డాలర్ రూపాయి బిళ్ళకు
మన ప్రాణాలు ఉరితీయబడతాయి
బహుళజాతి సంస్థలు బహురూపాల వేషంలో పరికికంపలా మొలకెత్తి
బడుగు వర్గాల పొత్తికడుపులమీద
ఆరని కుంపట్లై రగులుతూనే వున్నాయ్
తమ్మీ! మన పల్లెల్లోనే మనం మనకు తెలియకుండానే
మంచులా ఆవిరైపోతున్నాం
ఏ అంచువాడో తెలియకుండానే అదృశ్యమైతున్నాం
పల్లెపొలిమేర్లచుట్టూ డాలర్ రూపాయి కంపువాసన ఆవరించిపోతుంది
మనమంతా పరాయీకరణ కంపు కాలుష్యంలో
ఊపిరి సలుపలేకపోతున్నాం
వీటన్నింటిని ఛేదించేందుకు ఆలోచనా అలలహస్తాలతో
ఏదో ఓమునుం పట్టాల్సిందే
సుతి మెత్తని తల్లి ఒడిలో బిడ్డ గాఢంగా నిద్రించినా...?!
కాగితపు ఒడిలో మాత్రం నా కలం రెండు కనురెప్పలను తెరచి
అవిశ్రాంతం గ్లోబలైజేషన్ గోల్‌మల్‌మీద పహారాకాస్తూనే వుంటాయ్
రేపటి మట్టి పరిమళసమాజాన్ని ఆవిష్కరించేందుకు.

❀ ❀ ❀

## ఏ.వి. ఆర్. మూర్తి

# వెంటాడే పీడకల

వాడు రెండు స్వప్నాల మధ్య పీడలా వస్తాడు
వాడు రెండు దీపాల మధ్య క్రీనీడలా నిలుస్తాడు
ఇద్దరు శ్రమజీవుల మధ్య
అక్రమ వ్యాపారం చేస్తాడు
ఆడుకొనే పిల్లలకు
బంతికి బదులు బాంబులు పంచుతాడు
వాడికెప్పుడూ అగ్గిరాజెయ్యడం
మంటలు వ్యాపింపచెయ్యడమే తెలుసు
వాడి నిఘా ఎప్పుడూ దగా చెయ్యడానికే
గా(ట్)టుపెట్టడం, గాయం చెయ్యడం
గాదె నింపుకోవడం ప్రధానం
దానికోసం ఏ చర్యకైనా వాడిగడతాడు
ప్రతీదీ గుప్పెట్లో పెట్టుకుంటాడు
ప్రతీ ఒక్కడు తన పాదాలమీద పడాలనే చూస్తాడు
వాడు రైతుమీద స్వారీ చేసే రౌతు
రెండు సుస్థిర రాజ్యాలమధ్యనే
వాడు మండించే మారణహోమం
రెండు వర్గాల మధ్యనే
వాడు నిర్మించుకొనే మార్గం
వాడొక అందమైన దయ్యం
మనల్ని చుట్టుముట్టే విషవాయువు.



ఒబ్బిని

# 'వియ్యారెస్' ఉత్తరం

రుతువులన్నిటా 'వియ్యారెస్' వీరంగం!
రుతువులన్నిటా 'వియ్యారెస్' జజ్జనకరజనారె...!

❀ ❀ ❀

ఈ ఫోను మా కానిది, మా చెడ్డది, గడోతి!
తెగిపోతూ, తెగిపోతూ మన దుంపతెంచుతాది
చిటికలో తల్లీ బిడ్డలని విడదీస్తాది
ఆత్మీయ పదాలనైనా ఆజన్మశత్రుత్వానికి దారితీయించగలదు!
అందుకే ఈ ఉత్తరం!
అమ్మా! నీవు బతకాలి ఆరోగ్యంగా ఉండాలి!

❀ ❀ ❀

తల్లీదండ్రీ తప్ప
బిడ్డలకి ఇంకెవరు దిక్కు!
గొంతులోతుల్ని కొలిపించుకోవడానికీ,
'ఆప్త వచనాల కౌన్సిలింగ్'కి కూర్చోడానికి-
బిడ్డలు తల్లిదండ్రుల జిరాక్స్ కాపీలు!

❀ ❀ ❀

పాతకథలో
రావణుడు నేలనే పెకిలించినట్లు ఈ 'వియ్యారెస్ ఎండ'తో
భూకంపం మాదిరి నిన్ను చేరని స్థితి,
ఊరు రాలేని పరిస్థితి!
చీలుతున్న నేల కూలుతున్న నాలుకలు!
అమ్మా, నీ ఆరోగ్యం జాగ్రత్త!

❀ ❀ ❀

నోరెళ్ల బెట్టిన కప్పల్లా బట్టలు క్లిప్పులు
బట్టల క్లిప్పుల్లా మేము
'వియ్యారెస్ వడదెబ్బ'కి!
అమ్మా!
నీ ఆశీర్వాదమే చలివిడీ వడపప్పు వడదెబ్బకి!
అమ్మా!
ఓ రెండు కొబ్బరాకులు ముహూర్తపు షాటుకి క్లాపు కొడుతున్నాయి
ఉదయభానుడి మీద!
అమ్మా నీవు బతకాలి!
నీకు నేనూ, నీవు నాకూ వినిపించుకునే ఈ మాటలు
కవిత్వమై జీవితానికి సమాధానం కాగలవని కోరుకుందాం!
అమ్మా, నీవు బతకాలి!
ఈ 'వియ్యారెస్' క్రూరజంతువు
నన్ను నమిలేసినా సరే! నిన్ను నాకు దూరం చేసినా సరే!
ఎన్నెన్నో ముఖసంతకాలు
చిగురాకుల్లా ఆకుల పోగుల్లా
తల్లులవీ, తండ్రులవీ చూసుకుంటూ సేదదీరుతాను!
అమ్మా, నీవు బతకాలి! మమ్మల్ని బతికించాలి
బతుకుని మోసే ధైర్యాన్ని ప్రసాదించాలి!
జీవితానికి సమాధానం
తల్లీబిడ్డల రెండు దేహాలనుండీ సమానంగా రావాలి!



## డా॥ కలువగుంట రామమూర్తి

# గ్లో'బలై'జేషన్‌కు 'బలై' పోకు!

నాగేటి (చా)లు గర్భగుడులున్న మన పొలాల ఆలయాలలో
నెత్తిన మొలకెత్తిన గంగను ధరించిన
ప్రతివిత్తునూ ఒక మహత్తర శివలింగంలా
ప్రతిష్ఠించాలనుకునే మనరైతు కృషికి ఋత్విక్కు!
వాడి మనోభావాలు దెబ్బతింటే నేలతల్లి నోరు చేసుకుంటుంది!
మన విత్తనాలమీద మరొకడి పెత్తనం ఏమిటి?
మన బియ్యాలను దయ్యాలకు అంకితమివ్వడం దేనికి?
సుగంధాల అందాల్ని మరొకడికి అమ్మడం ఎందుకు?
ఈ 'పేటెంట్' హక్కులతో పేషెంట్సు కావడమేనా!
నేలతల్లి బిడ్డల్ని నమ్ముకుంటుంది - కానీ, అమ్ముకుంటుందా?

మన గ్రామీణ కోకిలపాటకు కొత్త ట్యూనెందుకు?
మనదేశవాళీనెమలి ఆటకు కొత్తగా ట్యూషనెందుకు?
మన ఆవు అంబా అంటే చాలు - మన బిడ్డ అమ్మా అంటే మేలు-
మన బిడ్డలకు ఉంటే అమ్మ పాలిద్దాం-లేకుంటే ఆవు పాలిద్దాం.
అంతేగానీ అందంగా ఉండే బొమ్మ పాలెందుకు?
మన పసికందుల నోళ్ళను అమ్మలనుండి ఆవులనుండి పాలిత్తిన్ పొదుగుల
వరకు

ఏనాడో జరిపివేశాం
అమ్మలకూ బొమ్మలకూ భేదం తెలియక, స్త్రీలింగం, పుంలింగం
భాషకే పరిమితమైపోతున్న, ఈ ఫ్యాషన్ పెరేడ్‌లో
మన ఆచార సంప్రదాయ సంస్కృతులకు ఆశ్రయం ఉందా?
విశ్వ విపణి వీధి ద్వారాలు తెరుచుకుంటున్న తరుణంలో

మన తారుణ్యాన్ని, మన కారుణ్యాన్ని మనం కాపాడుకోవలసిందే!
మాతృమూర్తులతో మనకు పనిలేదు - టెస్ట్‌ట్యూబుంటే చాలు క్లోనింగ్ మరీమేలు!

ధర్మపత్నులవసరం లేదు - బ్లూఫిల్ములు, రబ్బరు బొమ్మలు ఉంటే చాలు!
కన్నబిడ్డలు ఎందుకు దండుగ - రోబోట్స్ అందుబాటులో ఉండగా!
ఇక మనమెందుకు మన వీర్యకణాలో, శరీరకణాలో ఉంటే చాలు!
జనమెందుకు - ధనం ఉంటే చాలు! O My God!
చిరంజీవుల బాల్యాన్ని ఈ కాన్వెంట్లకు బలిపెడుతున్నాం
వాళ్ళ యవ్వనాన్ని కార్పొరేట్ కాలేజీలకు పొలి పెడుతున్నాం
వాళ్ళ జీవితాన్ని విదేశాలకు ఎగుమతిచేస్తున్నాం డాలర్‌ల, దీనార్‌ల దిగుమతి కోసం!

ఈ గ్లోబలైజేషన్ శిరోభారంగా మారుతుంటే,
చంద్రమండలాల్లో సైట్లను కొనే 'ప్లానటైజేషన్' మరో భారంగా మారుతోంది!

భూమండలం మీద ఇప్పటికే ఉన్న డోర్‌వార్స్-
ఆకాశపు అంగళ్ళకోసం, గ్రహాల కోసం ఆగ్రహాలతో
చోటుచేసుకోబోతున్న స్టార్‌వార్స్-
థ్రిల్లింగ్‌తో ప్రారంభములు కిల్లింగ్‌తో అంతమయ్యే
అక్రమ సంబంధాల త్రివిక్రమ రూపం, ఈ ఎయిడ్స్ - రానున్న ప్రళయాలు.

ప్రపంచ బ్యాంకు కట్ట తెగగొట్టి ధనాన్ని ఋణంగా తెచ్చుకుంటాం
సుగుణాన్ని ఋణంగా ఇచ్చే బ్యాంకెక్కడుంటుంది?
ఉద్యోగాలకు విదేశాలకు వలసపోతే - గ్రామాలు పలుచబడుతున్నాయి.
'వైట్‌కాలర్ జాబ్స్' మీది విరహంతో మాగాణులు బంజరులవుతున్నాయి
విదేశాల పారిశ్రామిక విప్లవాలముందు
మన హస్త కళలు అస్థవ్యస్థమైపోతున్నాయి!
మన ఆడపిల్లలు పంజాబీ - బీబీలయిపోతున్నారు!
మన డ్రస్సు మారిపోయింది - అడ్రస్సు మారిపోతోంది!

మన ఊరు మారిపోయింది - మన తీరు మారిపోతోంది!
మన భాష కొన ఊపిరితో శ్వాసిస్తోంది!
సోదరా! ఇంకైనా మేలుకుందాం! మన ఉనికిని కాపాడుకుందాం!
అపర భగీరథులై జలాల్ని మన ముంగిళ్ళ ముందు ఆటలాడిద్దాం! పండిద్దాం!
హ్యూమనిజాన్ని, దేశభక్తిని నేర్పని చదువు బాసిజాన్ని, బానిసిజాన్ని పెంచుతుంది
ప్రేమరాహిత్యం మొత్తం విశ్వాన్నే అభద్రతలో ముంచుతుంది!
చేతికి చేరెడు కన్నీళ్ళను పంచుతుంది! జాగ్రత్త!
గ్లోబల్ విలేజికి దారులు తీసిన ఇంటర్నెట్ రహదారి గుండా
దారి దోపిడీ మురాలు, కరుడుగట్టిన అమానుష మరాలు నట్టింటి కొస్తున్నాయి
ఈ వెబ్‌సైట్‌లో అల్పక్రిమిలా తగులుకొని
సోదరా! ఆ స్పైడర్ ముందు 'బలై'పోని గ్లో'బలై'జేషన్ కోసం యత్నించు!

Wish you all the best.



## కందుకూరి శ్రీరాములు

# పాదం

ఎంత కాపాడినా
గుండెకాయకు తూట్లు పడుతూనే
ఉన్నాయి
బర్రె ఏ చేలో ఉంటేనేం
బెత్తం వాని చేతిలో ఉంది
శిరస్సుమీద మోపుతున్న పాదం వాడిది

నిన్నటిదాకా బొమ్మల్తో ఆడుకునేది
చిన్న పిల్లలనుకున్నాం
ఇవాళ
పెద్దవాళ్ళను సైతం
చిన్న పిల్లల్ని చేసి ఆడించటం
మొదలైంది

వల
పంటమీద
పాడి మీదనే కాదు
సమస్త సంపదమీదా విసురుతున్నప్పుడు
మోరెత్తి చాచటం వెర్రి లక్షణం
రోజుకో నక్షత్రాన్ని తింటూ
భూమండలాన్ని
అమాంతం మింగేయాలనే
తాపత్రయం వాడిది

ఇక్కడి మట్టి వాసన పీల్చి
వాడి తలలో కలలు ప్రవేశించాయి

ఎన్ని కోటగోడల
జన్మ వృత్తాంతముందిక్కడ
ఎన్ని ఇతిహాసాల చారిత్రక
ఘట్టాలున్నాయి యిక్కడ
గుట్టను నమ్మి,
గునపాన్ని నమ్మి జీవించే
జీవుల నోట్లో మట్టికొడుతున్నాడు
వాడు

చెమట విలువ
యంత్రాలకు తెలియదు
రక్తం విలువ
ఇంధనానికి తెలియదు
మంగళసూత్రం పసుపుకొమ్మును
లాక్కోవాలనే ఆలోచన వాడిది
పెట్టుబడి వామపాదంతో
ప్రకృతిని బలి తీసుకుంటున్నాడు

కిరాతకుని నూకలకు
పావురాలు ఆశపడకుండా
హాయిగా ఆకాశంలోనే
విహరింపనిద్దాం

రూపాయి మేకను
పులిడాలర్ మింగేయకుండా
ప్రాణాంతకం చేసేవాటిని
బోనులో బంధిద్దాం.



## కె. ఉషా సరస్వతి

# బీజ సంహారం

మంటిపేగుని చీల్చుకొచ్చి మడినిండా అల్లుకుపోయే
తరతరాలనాటికల కంప్యూటరు కంటిరెప్పల్లో చిక్కుకుపోతోంది.
మొక్కనుంచీ మొక్కను పుట్టించే హక్కు
పరాన్న భుక్కు డేగల రాకాసి ముక్కుల్లోంచీ రాలిపడే పొల్లులో
కలిసిపోతోంది.

పైరు ఎగరేసే పసిడికంకుల పతాకాల్ని నిర్వీర్యపరచి
పునఃహరితీకరించలేని వంధ్య జన్యు శకలాలతో నింపేసే నీచకుట్ర
సస్యవిప్లవాన్ని సామ్రాజ్యవాద దాస్యపంజరంలో దాచి దోచుకోబోతోంది.
ఇంటర్నెట్ సాలిగూట్లో ఈగలై ఇరుక్కొన్న దేశాల్ని మీటలతో
నియంత్రిస్తున్న సైబరు సైంధవుడు
ఇప్పుడు మనం తినే అన్నం ముద్దలమీద తన ముద్రలే వుండాలని
సూత్రీకరిస్తున్నాడు
బకాసురుడి బలిపీఠపు బలోన్మాదాన్ని విశ్వన్యాయపీఠపు ఉత్తర్వులుగా
వక్రీకరిస్తూ!

వ్యాపారవాంఛతో-ధనకండూతితో
పందుంపుల్లల్ని వెతికే వేళ్లని పేస్టులటేస్టుకి కట్టిపడేసినవాడు
తమలపాకులు నమిలేనోళ్ళకి లిప్స్టిక్కుల మైకం కమ్మించినవాడు
తోలుబొమ్మల్తో తైతక్కలాడే కళ్ళకి ఛానళ్ళ ఛత్వారపు జోడు
తగిలించినవాడు
నాగళ్ళని నరికి కార్ఖానాల కొలుములకి ఇంధనంగా పేర్చుతున్నవాడు
వసంత కోకిళ్ళని చంపి కాలుష్య మేఘాలమొలలో వేలాడగట్టినవాడు
మన సంప్రదాయాల్ని, ఆశయాల్ని తన తక్కెడరాళ్ళుగా మార్చి మూసు
పోసేసుకొన్నవాడు

మన నరాల్ని తెంపి తన కరెన్సీ నోటు గట్టిదనానికి లోహపు తీగలా
వాడుకొంటున్నవాడు
విత్తమ్మీద గుత్తపెత్తనం చెలాయిస్తూనే-
ఇప్పుడు కొత్తగా విత్తనగర్భంలోకి విషంపూసిన విచ్చుకత్తులు
గుచ్చుతున్నాడు.

❀ ❀ ❀

అలనాడు మన పూర్వీకులు-
మొహంజొదారో మీదుగా నాగరికతని బీరతీగలా పాకించటం తప్పే!
సున్నా నుంచీ సూర్యమానందాకా తాళపత్ర బీజాక్షరాల్ని ఖండాంతరాల్లో
పండించటమూ తప్పే!
వాడు ధరించే గుట్టలమీద, వాడు నిర్మించే మిద్దెల మీద
మనకు గల వారసత్వపు ఆధిపత్యపు హక్కుల లెక్కలడగలేదనే-
ఇప్పుడీ పేటెంట్ల పేడితనపు సంకెళ్ళతో సంకుచితమై మనల్ని
కొల్లగొట్టాలని చూస్తున్నాడు.
కోరుకున్న రెండు మనసుల కలయికకి కాంట్రాక్టులు, పెనవేసుకొన్న
రెండుగుండెల్ని విడదీయదానికి అగ్రిమెంట్లు
కనిపెట్టినవాడికి 'వృక్షాన్ని - విత్తనాన్ని' వేరుచేయదానికి చిరుసంతకాల
పనిముట్లు చాలా
తోటివాడి హక్కులమీద కుక్కల్ని ఉసిగొల్పదానికి కాగితాల కొరడా

అణుక్షిపణుల అదిలింపుల్తోనో, డాలరు డైనోసార్ల గాండ్రి
కాపిటలిస్టు క్లోనుల మోహా
కలాన్ని శాసించినంత సులువుగా పొలాన్ని శాసించవచ్చే
కాని - ప్రతిఘటించే కాలాన్ని శాసించడం ఎవడితరం

❀ ❀ ❀

కొండేపూడి నిర్మల

# జీవితం వర్సెస్ ట్రూప్ బజార్

ఒక పింగాణీ అట్టహాసం
ఒక ప్లాస్టిక్ దబాయింపు
ఒక లోహపు డమ డమ
మనుషుల్ని తరిమికొడుతున్న మార్కెట్లో
మానవ విలువలు తక్కెడలో వున్నాయి
కొంటారా? అమ్ముతారా?
చీటీలు కట్టాల్సిన పనిలేదు
తల తాకట్టు అవసరం లేదు
అభిరుచి, మన్నికల ప్రసక్తే లేదు
స్పాన్సరింగ్, చెంచా, కమీషన్‌గిరి చాతుర్యంతో
కుప్పలు పోసిన వస్తువులు
ఇన్‌ఫ్లేషనా? డిఫ్లేషనా?
గదికీ మదికీ గవాక్షాలు మూసుకుపోయాయి
వైశాల్యాన్ని నమిలి మింగడానికి
వ్యాపారకాల వస్తుదంతాలున్నాయి
పందుర్ష బరువుకి మాట ఆగాధంలో పడిపోవచ్చు
తమలపాక్ఖోతకి జీవన సంగీతం మూగబోవచ్చు
తోలుబొమ్మత్తాల దూరం నుంచి పుష్కరానికోసారి
'చ్చిన మా అక్కాచెల్లెళ్ళ మధ్య
నాగళ్ళని నరికి 'రి వస్తువుల గురించిన సంబరాలే
వసంత కోకిళ్ళని శ్రీన మొగుడికంటే
మన సంప్రదాయాలిసిన మగాడికి మార్కులు బాగా పడతాయి

అశాంతి అనిపించినప్పుడల్లా ఒక వస్తువు
భద్రత లోపించినప్పుడల్లా ఒక వస్తువు
నైబర్స్ ఎన్వీలుగా రూపెత్తడానికి ముందు ఒక వస్తువు
ఆత్మలింగాల్లా ఇల్లంతా పాతుకుపోయి
నడకను కుంటుపరుస్తాయి
వాయిదా పద్ధతిమీద కొరుకుడుపడ్డ కష్టార్జితానికి
గాయం కనిపించదు విషం మాత్రం నమ్మకంగా దిగుతుంది
సెంకడ్ హ్యాండ్ వస్తువులమీద సైతం
భావప్రాప్తి సిద్ధించిన కలలే
మనిషి జబ్బు పడినప్పుడు కూడా రానంత బెంగ
వస్తువు రిపేరయినప్పుడు వస్తుంది
కొత్తకోడళ్ళ సజీవ దహనాలకి
కానుకలమీద మోహం తప్ప
కారణమేదయినా వుందా?
పెళ్ళంటే వస్తువుల పరంపర
పండగంటే వస్తువుల సమాహారం
ప్రేమంటే వస్తువుల జాబితా
మరణమంటే వస్తువుల మిగులు
వెరసి జీవితమంటేనే ఒక ట్రూప్‌బజార్
వస్తువుల హోదా లేకుండా
మనుషులమధ్య సంభాషణ సాధ్యంకావడంలేదు
వస్తు సంఖ్య పెంచుతారనే వ్యామోహంతో తప్ప
తల్లులు పిల్లల్ని కనడంలేదు
అయిన వాళ్లని ఇంట్లోంచి పొమ్మని
మీరింక నోటితో చెప్పక్కర్లేదు
బేరం చేసిన వస్తువులే పొక్కుంటూ వచ్చి
పకడ్బందీగా పొగబెడతాయి
రోజులు తరబడి బూజులు దులిపి కడిగి సర్ది

సగం ఆయుర్దాయం వస్తువు పాదాల కందిస్తాం
ఆకలి వ్యూహాన్ని తట్టుకోలేని అర్భకుడి పాలిట
నెల్ల తరబడి నిర్వహించే స్టే ఎగ్జిబిషన్
ఒక వల్గర్ యాక్ట్!
తొక్కిసలాటకు రేగిన దుమ్ముతోబాటు
ఆవలించిన అంగళ్ళనీ రెప్పవాల్చి దులుపుకోలేక
కాకవికలైన కళ్ళలో
వస్తువు ఒక పాచిక



## కొత్తపల్లి ఉదయబాబు

# డాలర్ ఖడ్గం

పరాయితనం
పచ్చని బ్రతుకుల్లోకి
పరకాయ ప్రవేశం చేస్తుంటే-
హిప్నటైజ్ జీవుల్లా

ఆడ మగ యంత్రాలు పనిచేయడం ప్రారంభిస్తాయి!
డాలర్ ఖడ్గం తెంచిన అనుబంధాలు-
చిమ్మిన రక్తప్రవాహాలు
సెంటు స్ప్రేలుగా పరావర్తనం చెందుతుంటే-
శ్వేత వర్ణపు కలలన్నీ
గ్లోబలైజేషన్ పట్టకంలో
సప్త వర్ణాలద్దుకుంటాయి!
పేగుబంధాలు మట్టిబంధాలు
సమయోజనీయబంధాలై
రక్తసంబంధాల ఎడారిలో యింకిపోతాయి!

నమ్మకాలు-
ఛిద్రమైన గాజుపలక జీవితాలలోంచి
వేయి పడగల పాములై వెక్కిరిస్తుంటే
మనిషి ఆశలు కొత్త బురఖా తొడుక్కుని-
అవసరాలను నమ్ముకొన్న జీవనమాధుర్యాన్ని
అమ్మకానికి సిద్ధపరుస్తూ
యూనివర్సల్ స్టేజీపై ప్రదర్శనకు సిద్ధమౌతాయి!!!



## కోట్ల వెంకటేశ్వరరెడ్డి

# ప్రపంచీకరణ ఒక నినాదమే!

యుద్ధం చేయక్కర్లేదు
సూర్యుడు అస్తమించని సామ్రాజ్యాలను
ఏలాల్సిన అవసరము లేదు
కాలం మారిపోయింది.
జాతులు చైతన్యవంతమవుతున్న క్రమంలో
అంకుల్ శ్యాం బుర్రలో
కొత్త ఆలోచనలు పుట్టుకొస్తాయి
ఎరవేసి చేపను లాగటం
వానికి తెలిసినంత మనకి తెలియదు
వేపచెట్టు, పసుపు ముక్క
చివరకు బక్క రైతు, గోమూత్రం
హక్కులు కోల్పోయి
వైట్ హౌసులో బంధించబడ్డాయి
ప్రపంచ బ్యాంకు పడగనీడన
మనం బతుకుతున్నాం
ప్రపంచీకరణ పదం
నయవంచనకు పర్యాయపదం!



కోసూరిగాంధీ

# డాలరు

చెట్ల గాలిని సిలెండర్ల కెక్కించి
మనవీపులకే తగిలిస్తుంటే
ఇక్కడ మొలకెత్తే ప్రతి విత్తనం
పెట్టుబడిదారీ కట్టు తంత్ర జలంతో
శుద్ధిచేయబడాల్సివస్తే
గాలినిచ్చే ప్రతి చెట్టూ.
పేటెంటు హక్కుతో బిక్కు బిక్కుమంటుంది.

బడారాజ్యాల ఇబ్బడి ముబ్బడి అప్పు
అమ్మ గర్భిణీతనాన్ని
ఆ రోజుకారోజు పెంచిపోషిస్తుంది.
భూమిమీద పడ్డాక
చట్టం శిశువును
ఋణగ్రస్తుల లిస్టులోకి వేగంగా చేర్పుతుంది.

క్లోనింగ్‌ను, సైక్లోనింగ్‌ను
ప్రయోగబద్ధం చేసి
ప్రపంచంపై పెనుభూతాన్ని అదిలిస్తుంది.

భూమిమీద బడుగుజీవితాలన్నీ
డాలరు వలలో చిక్కిన చేపపిల్లలే.
బతుకుని, భవిష్యత్తుని
మతాన్ని, మనిషి తత్వాన్ని
నాగరికతనీ వస్తు నాణ్యతనీ
డాలర్ నిర్దేశిస్తుంది.

తిరుగుబాటుకీ
అధికారం జరుగుబాటుకీ
అదో మంత్రదండం.
కాలం సాక్షిగా భూగోళపు
భవిష్యత్ వర్తమానాల్ని
తన రిమోట్ కంట్రోల్‌లో నిక్షిప్తం చేసుకుంటుంది.



ఎర్రబారిన కన్నులే ఎర్రెర్రని జెండాలై..
విశాలాంధ్ర నిండా విరబూసే సంగతీ..
తెలీటం లేదు వాడికి...
ఎత్తిన కొడవళ్ళమై వాడి ఆలోచనా కంకుల్ని కోసేస్తే తప్ప
రక్తం ఎర్రగా వుంటుందని
వాడి జీనోమ్ ప్రాజెక్టుకి తెలీదు...
మోదే సమ్మెటలమై....
వాడి అద్దాల మేడపై బడితే తప్ప...
"భూ" కంపం గురించి అర్థం కాదు...
జాగ్రత్త సుమా... వాడు టెర్మినేటరు విత్తనం
ఒక్కసారి నాటుకున్నామా... వాడు తప్ప...
ఇక మనం.. మొలవనే మొలవం...



గేరా

# కొత్త దేవుడు

మూడో ప్రపంచ ప్రజలారా!
మీ కోసం ఓ శుభవార్త!
ఈ సువర్ణావకాశం కాదంటారా,
తస్మాత్ తస్మాత్ జాగ్రత్త!!
మీకోసం
మన అగ్రాధిపత్యం సృష్టించింది సరికొత్త దేవుణ్ణి!
సర్వ వస్తుమయ స్వరూపుణ్ణి!
ఈ కొత్త దేవుడు మహిమాన్వితుడు!
మాయా మాంత్రికుడు!
మానుషుల్ని పాతి డాలర్లు పండించగలడు!
ఆకాశంనుండి ఆయుధాలు కురిపించగలడు!
బియ్యాన్ని మాయంచేసి, రొయ్యల్ని సృష్టించగలడు!
ఈ దేవుడు
అత్యాధునిక మృత్యోన్మాది! నిత్యనూతన మతోన్మాది!
ఇప్పుడు, భూగోళం చుట్టూ వాడి సమాచార సాలెగూళ్ళే
శతకోటి ఛానళ్ళ చూపులతో
మూలమూలల్నించి మీ మూలుగుల్ని తోడగలడు!
కోరికలకు కండోమ్‌లు తొడిగి
ఆకలికి కన్నీళ్ళు తాపిస్తాడు!
ఈ కొత్త దేవుడు అమిత కరుణామయుడు!
అణ్వాయుధ ధరుడు!
తన్నుకొనే తపస్సులకు తక్షణం ప్రత్యక్షమై

కోరుకున్నంత మేర ఆయుధాలు ప్రసాదించగలడు!
యుద్ధాలమధ్య పెద్దరికం చేస్తూ గద్దలతో పహారాకాస్తాడు!
మీరు చస్తే
చౌక దుకాణాల్లో రెండు డాలర్లకే కిలో బియ్యం
మీ పిండాలకోసం పంపిణీ చేస్తాడు!
మీరంతా ఇక సంభవామి యుగేయుగే అని
అసంభవాన్ని నమ్మనక్కరలేదు
పునరుత్థానం కోసం ప్రార్ధనలు చేయనక్కరలేదు! .
దువాకోసం చేతులు చాపనక్కరలేదు!
ప్రపంచ భక్తులారా ఏకంకండి!
కొత్త దేవుడికి మొత్తంగా లొంగిపొండి!
పెట్టుబడుల తీర్థం పుచ్చుకొని ప్రపంచబ్యాంక్ ఆశీర్వాదం పొందండి!
స్టాక్ మార్కెట్ ప్రసాదం స్వీకరించి లాకౌట్ల శఠగోపాలు పెట్టించుకోండి!
మీరంతా నిమిత్త మాత్రులు
లొంగిపోడానికి మాత్రమే పాత్రులు
చేసేదీ ఆయనే! చేయించేదీ ఆయనే!
హైటెక్ నగరీకరణే నాగరీకరణ!
ఉప 'సంహరణే' సంస్కరీకరణ!
సర్వేజనా స్సుఖరోగం భవంతు
అశాంతి, అశాంతి, అశాంతిః



## ఘంటశాల నిర్మల

# రంగుల చీకటి

చిన్నారులు మూడు నెలలవరకూ చూపు నిలపరట
- మా బామ్మ అనేది
పుట్టిన మూడోరోజు నుంచే చానెళ్ళ మీంచి చూపు తిప్పరని
మనం చూస్తున్నది!
ఇవాళ పురిటి పాపాయి పక్కన
పొత్తిగుడ్డలకంటే ముఖ్యం పోర్టబుల్ టీవీలు!

తెల్లవారి లేస్తే మా వాకిలి ఒక వాణిజ్య ప్రకటన!
మీ వీధివీధీ ఒక రంగుల అమ్మకాల సముద్రం!
బుల్లితెర బల్లివాతెర అయినప్పుడు
మధ్యతరగతి మనసంతా మనమంతా
జిగట వీడి రాలేని ఈగలమే - రోగులమే!
ప్రశ్నించే మెదళ్ళు మొదలంటూ నిద్రకు వొరిగితే ప్రకటనల
చొంగ ధారాపాతమే!

ఏ బ్రాండు దువ్వెన వాడితే ఎన్ని బంగారు పతకాలో
మామూలు ఉప్పు ఉపయోగిస్తే మాటపడిపోవడం వంటిదేదో
ఎలా ఖాయమో

స్నానం చెయ్యడం కంటే ఫలానా కంపెనీ గంధాల పూత
ఎంతలా నయమో ఉద్ఘాటించే ఉపద్రష్టాల్లు!
వస్తు వినియోగ ప్రచారం ఇవాళ మనపై పెద్ద సవాలు!!
మోహన్ ప్రమోషన్ చెయిజారడం అతగాడి రాధ రుద్దిన తెలివితక్కువ
బట్టతల సబ్బు వల్లనే!!

స్నానాలగదిని ఒక తల్లి తెల్లగా మరింత తెల్లగా వీళ్ళ పొదరుతో కడిగితే
ఆవిడ బుజ్జాయి రెప్పపాటున పైలట్ అయిపోతాడు!
జరగని పెళ్ళిళ్ళన్నీ నల్లని అమ్మాయిలవేననీ
మేని చాయ పెంచే మ్యాజిక్ ఇప్పుడు కారుచవకయిందనీ
పీటలమీద ఆగిన పెళ్ళి ఫలానా టీ సెగలతో అలవోకగా జరిగిందనీ
సూపర్‌మామ్‌ల తిరగమోత వల్లనే దేశచరిత్ర తిరగబడుతుందనీ
అబ్బబ్బా ఒకటీ రెండా - ఎన్నని అసంబద్ధ అతర్క కుతర్క ప్రకటనలు!!
బుజ్జిగాడి చెడ్డీలూ పందుతల్ల మిద్దేలూ
ఆవిడగారి తుంటినొప్పీ మామగారి తలనొప్పీ
పరీక్షల్లో జ్ఞాపకశక్తీ పదిచేతుల ఇల్లాళ్ళ వంటిళ్ళ అనురక్తీ-
అన్నిటికీ మసిపూసి మారేడు సమస్యల్ని చేసి
మళ్ళీ వాటన్నిటికీ తమ ఉత్పత్తుల విబూది పూసి చిటికెలో మాయంచేసి
వీక్షకుల వికారాల మీదా అమాయకుల అకాశవిహారాల మీదా
కలల పెట్టుబడి - కాసుల రాబడి!
పగళ్ళు తెల్లవార్లూ నిరవధిక నాటక అంశాలు!
ఇంకా కావాలంటే
తెల్లవారడమో పక్కలేంచి లేవడమో కూడా అవసరం-
ఆఫ్‌టైమరూ ఆన్‌టైమరూ వుండగా
పగలూ రాత్రీ కవ్వించీ జోకొట్టే తారా విభాగాల వీక్షణాలుండగా!

అనాది మానవుడి గుప్తవాంఛలన్నీ చానెలీకరించి
కలల్నీ ప్రలోభాల్నీ సరికొత్త మోసాల్నీ అతిపాత మోహాల్నీ క్రోడీకరించి
వాణిజ్య ప్రకటనలుగా రంగరించి గుచ్చే ఈ ఖండాంతర బేహారులు
మనల్ని ఏ పాతాళంలో పాతర వేస్తున్నారు!
పొద్దస్తమానూ దృశ్యాల కఠోర కొక్కేనికి వ్రెరికళ్ళనెలా వేలాడదీస్తున్నారు?

ఉపగ్రహం పుణ్యమా అని ప్రపంచమంతా మన చుట్టే!
కానీ చుట్టూవున్న ప్రపంచం మనకెంత దూరమవుతుందా అని!



## చింతల దేవెందర్

# జాతీయ జండా

రెపరెపలాడాల్సిన ముప్వన్నెల జాతీయ జండా
ముడుచుకుపోయింది మౌనంగా,
తనలోని రంగుల్ని సైతం సరిగా చూపకుండా.
త్యాగానికి చిహ్నమైన కాషాయం
ఎరుపు వర్ణంలా తోస్తుంది
రక్తసిక్తమవుతున్న కాశ్మీర్ సరిహద్దులా.
శాంతికి సంకేతమైన తెలుపురంగు
పత్తాలేకుండా పోయింది.
దేశంలో మృగ్యమైపోయిన శాంతి భద్రతల్లా.
ప్రగతికి ప్రతీక అయిన
పచ్చరంగు
స్పష్టంగా కన్పిస్తుంది
బక్క చిక్కిన రైతుల
పంటకి దక్కని గిట్టుబాటు ధరలా.
ధర్మానికి చిహ్నమైన ధర్మచక్రం
కనీ కన్పించకుండా వుంది.
వరల్డ్ బ్యాంక్‌కి మోకరిల్లిన
రాజకీయనాయకుల అసమంజసపు నిర్ణయాలకి
బలై, బక్కచిక్కిన రూపాయి విలువలా.



## చిమ్మపూడి శ్రీరామమూర్తి

# తప్పదు మరి....

సంకెళ్లు - సంకెళ్లుగా
బతుకుతోంది స్వేచ్ఛ.
మనిషిరూపూ-రంగూ అనుక్షణం
మారిపోతూనేవుంది.
దేశం ఎల్లలు ఏమూలలకైనా పారిపోవచ్చు.
దోసిళ్లకొద్దీ భయాలు నింపుకుని
దేశసంస్కృతిని గ్రాములు గ్రాములుగా అమ్ముకుంటూ
విదేశీ మూసల్లోకి ప్రవహించిపోతున్నాం.
ఎవరి చూపుడువేలుకో
మన అంగాంగాలు వేలాడదీసుకుంటున్నాం.
మట్టినుంచి మనిషి వేరయిపోతూంటే
ప్రేక్షక పాత్రల్లో నటిస్తున్నాం.
దేశంలోని ఒక్కో ముక్కా
ఆల్విన్నో, సర్‌సిల్కో అయిపోతోంది.
సామ్రాజ్యవాదపు కుష్టు
దేశదేహాన్ని కొంచెం కొంచెంగా కొరుక్కుతింటోంది.
మనిషిని నాటుపెట్టడంమానేసి,
తన తనాన్ని కోల్పోతున్న జాతి
వాగ్దానాల వరదల్లో తలమునకలైపోతోంది.
దేశం కరెన్సీని డాలర్ల దేగ తన్నుకుపోతోంది.
ప్రపంచీకరణ చాపకింద నీరై
అగ్ని పర్వతాలు పేర్చుతోంది.



## జి. ఆర్. కుర్మే

# గారడి ఆట

రాజ్యం
క్షేమం నుండి క్షామం వైపు నడుస్తూంటే
అధికారం
సంక్షేమం నుండి సంక్షోభం వైపు పరుగెడ్తుంటుంది.
బ్యూరోక్రసీ
రాజ్యాంగపు పుటల్లో దాక్కుంటూ బయటకొస్తూ
పేద ప్రజలతో దోబూచులాడ్తుంటుంది.

❀ ❀ ❀

ప్రపంచీకరణ పేరుతో ఒక సైబర్ వేటగాడు
గ్లోబల్ చేపలకు గాలం వేస్తుంటాడు.
గాలానికి చిక్కిన చేపను
ప్రైవేటీకరణ సంచిలో దాచి చంద్రమండలానికి
ఎండుచేపగా పార్సిల్ చేస్తుంటాడు. కంప్యూటర్ విస్తర్లలో
కమ్యూనికేషన్లను వడ్డించి
కాలే కడుపులకు కడుపు నిండా తిండి పెడ్తానంటాడు.
అమాయకపు ఓటును
పగలే కాటువేసే కాలనాగును నాగస్వరం ఊది ఆడిస్తుంటాడు.
ఉత్తచేతులేనని ఎంతమొత్తుకున్నా
ఆయుధాలు ధరించావని
ఆరడిచేసి భూప్రపంచాన్ని గారడి చేస్తుంటాడు.
అధికారాన్నెవరూ కట్టబెట్టకున్నా
పై అధికారిని తానేనంటూ తనిఖీలు చేస్తానంటూ తహతహలాడ్తాడు.

❀ ❀ ❀

జొన్నవిత్తుల రామలింగేశ్వరరావు

# కోతి మూత్రానికి పేటెంట్ వద్దా?

అందరం మెంటల్‌గా ప్రిపేరైపోదాం.
ఆవకాయకీ, ఆయుర్వేదానికీ, యోగాసనాలకీ, ప్రాణాయామానికీ,
పేటెంట్ హక్కులు తమవే అంటాడు.
అతి త్వరలో అమెరికావాడు.

మొన్న వేపచెట్టుకీ, నిన్న బాసుమతి బియ్యానికీ,
ఇవాళ గోమూత్రానికీ, ఆబగా అర్రులు చాస్తున్నాడు.

వేపచెట్టు దయ్యం పట్టినట్టు నవ్వుతోంది, ఈ వెర్రి స్టేట్‌మెంట్‌కి...
బాసుమతి బియ్యం "బోయిల్" ఔతున్నాయి "బాసు" మతిలేని మాటలకి

నరమాంస భక్షకుడు మానవతా గీతం పాడినట్టు,
ఎయిడ్స్ క్రిమి రక్తదాన శిబిరం పెట్టినట్టు,
గోమాంస భక్షకుడు గోమూత్రం గొప్పదనం చాటుతున్నాడు.
సర్వహక్కులకీ చట్టం బిగిస్తున్నాడు.
ఎక్కడెక్కడి తెలివినీ కొనుక్కుని,
ఎవరెవరెవరి శాస్త్ర రహస్యాలో కనుక్కుని,
ధీమాగా తనవంటాడు మేధావిలాగా మెయిన్‌టైన్ చేస్తూ...

ఉప్పు ఎక్కడ పుడుతుందో సముద్రానికి చెబుతాడు.
గొప్పగా, గట్టిగా గ్లోబు గుద్ది మరీ....
"లజ్జా పరిత్యాగం - త్రిలోకాధిపత్యం"
అన్నీ వదిలేస్తే - ఎన్నో పొందవచ్చు.
ఇదే అసలు సిద్ధాంతం.

విచ్చలవిడి జీవనాన్నీ, విలువల్లేని సంస్కృతినీ,
వైద్యంలేని రోగాన్నీ, విశ్వవ్యాప్తం చేసి

దీర్ఘాయురారోగ్యాల కోసం తూరుపు తిరిగి దణ్ణం పెడుతున్నాడు.
ఓషధులతో ఒడ్డునపడి నేరుపుగా తూరుపు తమదేనంటున్నాడు.
వెలుగు ముద్దలనీ, వెన్నెల ముద్రలనీ దిగుమతి చేసుకుని...
చీకటి ముద్దలనీ, 'రక్కసి ఊహలనీ, ఎగుమతి చేస్తున్నాడు.

స్వేచ్ఛ పేరుతో వి'శృంఖల' రాగం పాడుతున్నాడు
అప్రాచ్యుడు.
పేటెంట్ హక్కుల "ప్లేట్" డాన్సులో ప్రపంచ బఫూన్‌గా మారాడు

ఏనాడైనా....
వేప్పుల్లతో గానీ, ఆవుపేడ కచ్చికతోగానీ
పళ్ళు తోమాడా?
"ఆవు తల్లి వంటిది
ఆవు పవిత్రమైన జంతువు" అంటే
పళ్ళికిలించింది ఈ మొహమేనా...

కామధేనువుని 'డాట్‌కామ్' ధేనువు చెయ్యాలని చూస్తున్నాడు

గాడిద గుడ్డుకీ, ఎండమావుల్లో నీళ్ళకీ,
పేటెంట్ హక్కులు ప్రయత్నించేట్టున్నాడు.

బిన్‌లాడెన్ దెబ్బకి బ్రెయిన్ పనిచెయ్యడంలేదేమో!
వరల్డు ట్రేడ్ సెంటర్ నష్టాన్ని పేటెంట్ హక్కులతో

పూడ్చాలనుకొంటున్నట్టుంది.
బుర్ర పనిచేయక, వర్రీగా, చిర్రుబుర్రుమంటున్నాడు.

ఇరాకుమీద చిరాకు. పాకిస్తానుకు బహుపరాకు.
"స్నేక్ హేండు" ఇండియాకు

అన్నిదేశాల సంస్కృతులనీ హారతి కర్పూరం చేశాడు.
వ్యాపారి కానివాడికి జీవనం లేకుండా చేశాడు.

జనజీవన విధానాలకీ, ప్రభుత్వ విధానాలకీ,
పరోక్ష నిర్ణేత అయ్యాడు.
అది చాలక.... ఇప్పుడు పేటెంట్ హక్కులమీద పడ్డాడు.

అరెరరె కాస్ట్లీ క్లబ్బులాంటి దేశం
కాశీరామేశ్వరాలకే ఇస్తోంది సందేశం.
మహాసౌందర్యవతి అయిన కామినీ పిశాచిలాంటి కంట్రీ.
తానే అంటోంది గాయత్రి.
త్వరలో
తల్లిపాలకీ, సంస్కృత భాషకీ
పేటెంట్ హక్కులు మావే అనవచ్చు.
తస్మాత్ జాగ్రత్త



### జ్వాలాముఖి

# డాలర్ డేగ

"తలుపుతలుపు" వేధించే పిలుపు
మిట్టమధ్యాహ్నం వేళకాని వేళ
మంద్రస్థాయిలో అతిమర్యాదగా ఊళ
అతిథికాదు అభ్యాగతి అనిపించదు-

తలుపు తట్టింది పిలుపునిచ్చింది
ఎవరైవుంటారని సందేహాల సందోహం
కాలాడని కింకర్తవ్యాల ఆందోళన
తలుపు పిలుపు అమానుషం
క్రమంగా విక్రమించిన పిలుపు మాయ
దూసుక వచ్చిన స్వచ్ఛంద చిలుకలు
కూలదోసిన తాతలనాటి తలుపులు
తళుకు బెళుకులు చాకచక్యాల విందులు
కమ్మివేసిన సరస సరళీకరణలు-

ముంగిట్లో ముచ్చటగా చిలుకలు వాలిన చెట్టు
ఎగిసి పడుతున్న చిలుకల అందచందాలు
సందుచేసుకొని కనువిందుగా రాబందు
తాంబూలసేవనం ధారాపాతం నెత్తురుచొంగ
కాళ్లకు, తొక్కివచ్చిన దీనదేశాల రొంపి
గోళ్లకు, వేలాడుతున్న కళేబరాల కలలు
నక్షత్రాలపక్షి శాలువాలో చేరుతున్న చుక్కలు-

నట్టింట్లోకి దూసుక వచ్చిన ధూర్త ధృవైక రాజ్యం
తిష్టమార్చే ప్రసక్తి లేనేలేదని చిలుక రాయబారం
మెల్లగా కొల్లగొట్టే అగణిత యుద్ధాల బేరగాడు
అతిథి ఆక్రమణదారుడైన అధిష్టాన దేవత -

దిక్కుతోచని అనాది దరిద్రనారాయణుడు
అంతా ఊడ్చుకపోయిన ఆకలి గాలిదుమారం
ఎండుగల్ని ఒంటినిండా కప్పుకున్న కుచేలుడు
పూర్ణకుటుంబి పూర్ణాహుతి జీర్ణదేహుని జిజీవిష-

డేగను సేవించే స్వచ్ఛంద చిలుకలు
కాయకష్టం కొంపలో; వాయినాలు
వాయిదాల పద్ధతుల్లో అన్నార్తుల పద్దులు
ఇంట్లోకి జొరబడిన అంగడి, అశాంతి
ఒకటే హడావిడి, పెరిగే అభద్రతాభావం
కావాల్సినవి కనిపించని కటాక్షం, మార్కెట్ ఎకానమీ
అవసరంలేనివి ఆక్రమించే మోక్షం, షార్ట్ సర్క్యూట్
మార్కెటెకానమీ మహమ్మారిలో మనిషి దివాలా-

పప్పులుప్పుల సంగతి నామోషీ
ఆకలి అన్నాల విషయం ఖామూషీ
సొంత కొంపలో సరుకైన సగటు మనిషి
ఆశలు ఆశయాలు పనికిరాని చిత్తకృషి-

కొంపలోకి దూరిన "మాయల పెట్టె" దర్జాదర్బారు
దృశ్యా దృశ్యాల నిత్యసాక్షాత్కారాల సాదృశాలు
నొక్కుళ్లలో పొక్కులుపడ్డ సామాన్య జీవితాలు
పొయ్యిలో లేవని పిల్లిని భయపెట్టే "మౌజ్" -

పూటకూటిని బేరమాడే బజారు పహారాహుషార్
బతుకునిర్వచనం మార్చేసిన ప్రపంచీకరణ జోరు
ఆ మెరిసే దంతాల వెనుక నమిలిమింగే పళ్లు గోప్యం
అందుకే "జనంమిధ్య బతుకుపోరాటంమీధ్య" -

ప్రాణవాయువు మదుపులో కొనప్రాణాల అదుపు
పంచభూతాలమీద "పర్యావరణం" ఆంక్షలు కాంక్షలు
మన్నుబుక్కాలన్నా మంచినీళ్లు మనసారా తాగాలన్నా
అనుమతుల పరిమితుల స్థితిగతుల సంక్షోభం
ఊళ్లను ఉద్యమాల చాళ్లను లొంగదీసే రుణానందలహరి
దేశంలోనే దేశవాసి అంతెవాసి కాందిశీకుడు-

ఎలా బతకాలో ఏంచేయాలో డాలరు దేగ శాసనం
భూమి బిడ్డల్ని బేదఖలు చేసే కార్పొరేట్ సెక్టార్
దళారుల ఇష్టారాజ్యంలో తలారుల దౌర్జన్యం ప్రజాస్వామ్యం
బిత్తరపోయినవాడు కొంపకూలినవాడు దగాపడిన కష్టజీవి

డాలరుచేత డాలరుకోసం సాగే డాలరు తిరణాలలో
కష్టజీవి బిచ్చగాడు కాలేదు కాబోడు ఉనికి పోరాటం ఆపలేదు
డాలరు పద్మవ్యూహంలో చిచ్చుపెడతాడు
సామ్రాజ్యవాదానికి సమాధి కడతాడు
శ్రామిక న్యాయానికి నాంది పలుకుతాడు
డాలర్‌దేగ రక్త దాహాన్ని వెన్నంటి తరుముతాడు.



# టి.ఎం.ఆర్. రమణారెడ్డి

# గ్లోబల్ హైకూ

పైర్లు ఎండి
కడుపు మండి
పల్లె మూల్గింది. 1

చిమ్మచీకట్లో
రైతు చేతికి
ఉరిత్రాడు. 2

వరల్డ్ ట్రేడ్ వుచ్చులకు
వ్రేలాడే బొమ్మ
అన్న 3

బిన్‌లాడెన్
చిచ్చుబుడ్డి
డబ్ల్యూటీసి. 4

సన్నకారు రైతుల
వులన్ ఉరిత్రాడు
విశ్వవిపణి సంస్థ. 5

ఐ.ఎం.ఎఫ్. లోగిలిలో
బుక్కాఫకీర్లు....
వర్ధమాన దేశాలు. 6



## టి. కృష్ణమూర్తి యాదవ్

# జాగ్రత్త బక్క రైతులు

బక్క రైతులూ భద్రం సుమా!
మోసపోవద్దు
మీ చేతుల్లోనుండి
భూములు పరాయికరణ
చెందనూ వద్దు
ధనం సంచులు
మీ ఇంట్లోకి వస్తాయని
సర్కారు భ్రమలను కల్పిస్తున్నది కనుక
ఉబ్బి తబ్బిబ్బయి మీ తలకాయలను తీసి
వాళ్ల చేతుల్లో పెడతారు
మీ మొండాలు మీ ఇంటి దగ్గర
విలపిస్తూ ఉంటాయి
మీ మీ భూములన్నీ మాయమై
వ్యవసాయ క్షేత్రాలుగా రూపొందుతాయి
మీ బక్క ఎడ్లు తుమ్మనాగళ్ళు
భూములను దున్నడం మరిచిపోతాయి
మీ భార్యలు మీ వెనకాల నడుచుకుంట
నాగలి సాల్లల్లో విత్తనాలు వేయరు
మీ పెరళ్ళలో మీరు
పారలు పట్టి అచ్చుకట్టడం జరగదు
మీరు ఊసబియ్యం బుక్కడం
మరిచిపోతారు

గంపల్లో సద్దులు పెట్టుకొని
బావుల కాడికిపోయే దృశ్యాలు కన్పించవు
క్షేత్రాల్లో పండే గింజలు
మీకు మీ పిల్లలకు
అన్నం ముద్దలుగా మారవు
పరాయిదేశంలో ఉన్న
పశువులకు, పందులకు
కోళ్ల పరిశ్రమలకు
'దాన' పండించే భూములవుతాయి
చేలల్లో ధాన్యాన్ని బర్తీల కెత్తి
జీతగాళ్ళు కన్పించకుండ పోతారు
ఆకలేసినప్పుడు ఒక మక్కబుట్టను
కాల్చుకుని తినడానికి వీలుపడదు
మీ అజమాయిషిపోయి
కొత్త యాజమాన్యం మీ నెత్తిన కూర్చుంటది
రేపు మీరు వాళ్లకు
అక్కరకురాని చుట్టాలుగా కన్పిస్తారు
తరతరాలుగా భూములను
అంటిపెట్టుకొని బతికిన బతుకులు
వాడల పొంటి, వీధుల పొంటి తిరిగే
బతుకులుగా మారిపోతాయి
మీకు కన్పించని పెట్టుబడి సింహాలకు
మేక పిల్లలుగా మారిపోతారు
విత్తనాలు వేయడానికి
కలుపు తీయడానికి
కోత కోయడానికి
కూలీల అవసరమే కన్పించదు
ఇనుప యంత్రాలే పనులు చేస్తాయి

ఎండ్ల తరబడి పండించుకున్న విత్తనాలు
'టర్మినల్' విత్తనాలవుతాయి
కూలీ బతుకులుగా మీరు
మార్పు చెందుతారు
విజన్ టొంటిటొంటి నాటికి
మీరు బిచ్చగాళ్ళవుతారు



## డి. శ్రీధరాచార్య

# తెలంగాణా 'బక్క' రైతు

ఏమి యవసం - ఏమి యవసం రా నాయనో
కూడుగుడ్డకు నోచుకోని - బతుకు తెరువుకు ఆసలేని ||ఏమి||

దున్నడానికి భూమిలేదు కాడికేమో ఎద్దులేదు
పెట్టుబడికి దిక్కులేదు - చేతిలోన పైసలేదు ||ఏమి||

యిత్తనాలు కల్తివాయె - ఎరువులేమో పోసుడామె
మందులేమో చల్లుడాయె - అప్పులేమో పెరిగిపాయె ||ఏమి||

చెరువులోన చుక్కలేదు - బాయిలోన బొట్టులేదు
బోరుబాయిలో నీరువున్నా - కరెంటేమో దిక్కులేదు ||ఏమి||

కుండలోన యిత్తులేదు - పొయ్యిలోకి చితుకులేదు
తలెలోకి మెతుకులేదు - డొక్కలేమో ఎండిపోయె ||ఏమి||

సావుకారి బాకిమిగలె - పోరిదేమో పెండ్లి కచ్చె
గుడిసెకప్పు లేసిపాయె - కట్టుకోను పంచె (కోక)లేదు ||ఏమి||

రైతు పంటకు యిలువలేదు - రైతు మాటకు బలంలేదు
రైతుదోపిడి ఆగలేదు - రైతుచావులు నిలవలేదు. ||ఏమి||



## తుమ్మల దేవరావ్

# బుల్లితెర

మనం వద్దనుకున్నా మనమధ్య కాలాన్ని
ఓ కేబుల్‌వైరు లాక్కుని బుల్లి పెట్టెలో దాచుకుంటుంది
ఆత్మీయ బంధాలన్నీ అటకెక్కించి
బుల్లితెర పలకరింపుకోసం ఎవరికివారే బారులు తీరుతాం
మన ఏకాంత సమయాల్ని ఒక్కటొకటే కబళించి
మస్తిష్కంలోకి వింత దృశ్య ప్రసారం ప్రవాహంలా యదేచ్ఛగా సాగుతుంది.
కళ్ళ ముందు రంగురంగుల దృశ్యాలు నాగరికతను వదులుకుంటూ...
అసహ్యంగా, అనూహ్యంగా· హోమేసేపియన్‌లా నర్తిస్తుంటే...
మన కళ్ళముందు ప్రపంచం మాయమై... క్షణంలో ఏదో ప్రపంచపు
అనవాలు.

రిమోటు మీట నొక్కగానే క్షణక్షణానికి ఊసర వెల్లిలా చానల్‌లు
రంగులు మారుస్తు ఊపిరి సలుపని ఉత్కంఠను కల్గిస్తాయి.
కోరికల కలుగును తవ్వగా ముందు బయల్పడ్డ టి.వి.
మన ఠీవిని డొల్లచేసి భవిష్యత్ జీవితాన్ని శాసిస్తుంది.
ఒక దృశ్యాన్ని కళ్ళల్లో దాచుకుందామనుకునే మరుక్షణంలో
మరోదృశ్యం పరకాయప్రవేశం చేసి మెరుస్తుంది.
ఇక్కడ దృశ్యాలంటే మెరుపులే కాదు, క్షణక్షణం మన చూపుల్ని కత్తిరించే
సహస్ర ఖడ్గాలు

ఇంటిల్లిపాది వాకిట్లో కూచోని
వెన్నెల పుప్పొడులు నులకమంచం మీద రాలుతుంటే
గంగవ్వ.. ఎల్లన్న అంటూ గుండెల్నిండిన ప్రేమతో ఆత్మీయంగా
పలుకరించుకునే వారిమి
ఇపుడు టి.వి. భూతం కృత్రిమ పటుకరింపుకోసం

ఇంటింటా బందీలైతున్నాం
అలుకు చల్లేవారు కరువై వాకిళ్ళు పెచ్చులూడి బోసిపోయాయి.
పెళ్ళి పేరంటాల్లో వావి వరసల సరసం సందర్భోచితంగా ఉండేది.
టివి ప్రతిష్టించుకున్నాక ద్వందర్థాలు లేని సంభాషణలు కరువయ్యాయి.

ఇంతకాలం బతికించుకున్న భాష, యాస, వేషం మారిపోయి
సరికొత్త ఫ్యాషన్ ట్రెండులో పడి కొట్టుమిట్టాడుతున్నాం
నిన్నటివరకు గజ్జవ్వ మంచిగున్నావా! అంటూ పలుకరించినవారే
ఇపుడు ఎద్దుగొట్టు సీరియళ్ళ గూర్చి సీరియస్‌గా మాట్లాడుతారు.

సినీతారల అంగాంగ సౌష్ఠవ కొలతల్ని బేరిజువేసే టేపులు
పాప్ సింగర్లు వేసే పిచ్చిగంతుల అల్బమ్‌లు, మదుపు దున్నాల్లా పొట్లాడే
రాక్ గున్నల చిత్రపటాలు ఇంటింటా నింపుకుంటున్నాం.
క్రికెట్ మ్యాచ్ ప్రసారమవుతూ...
భయంకర తుఫానులా గుండెను ఓటమి అంచుకు పరిగెత్తిస్తుంటాడు
రన్నింగ్ కామెంట్‌తో కామెంటేటర్ -
మధ్య మధ్యన వాణిజ్య ప్రకటనలు పుండుమీద పుట్రలా,
అనాచ్ఛాదితంలా రూపాయి బిళ్ళమీద జీవితాన్ని దొర్లిస్తాయి.
మనమంతా కేబుల్ గాలానికి చిక్కి
ఏ బంధాలు లేకుండా జీవిస్తున్నాం
పిల్లల ముందు పెద్దలు - పెద్దల ముందు పిల్లలు
ఒకరినొకరు అపరాధుల్లా చూసుకుంటూ శిక్షించుకుంటు
అశ్లీల దృశ్యాల్ని చూడలేక నేలమీద చూపుల్ని వాల్చుతాం
మన ఆకాంక్షల్ని, అభిరుచుల్ని, వ్యక్తిత్వాన్ని
సాంస్కృతిక వారసత్వాన్ని మన ప్రమేయం లేకుండానే
"బుల్లితెర" ఆవిష్కరిస్తుంది.

అపుడు మనం యంత్రాలమో, క్లోనింగ్ జంతువులమో
సజీవులమో, నిర్జీవులమో తెలియని సందిగ్ధావస్థలో ఉంటాం
బుల్లితెర ముందు మనిషి ఉనికి మరుగుజ్జయితున్న
పరిణామం మనమిపుడు గుర్తిస్తున్నాం.

## తైదల అంజయ్య

# హ్యూమన్ ఫర్ సేల్ డాట్ కామ్

తలపుట్టలో పాముల కదలిక
అందని సరుకునిప్పుల మధ్య మనిషి దహనం
చిత్రమింకా పూర్తికాలేదు.
మనిషి నడిచి వెళుతున్నాడు,
వస్తు ప్రపంచాన్ని జయించుకొద్దామని.
కలిసి గెలుద్దామని, కలిసి బతుకుదామని
తెగించిన చోటనే నడక మొదలయింది.
తిరిగొచ్చేటప్పుడు తలలేదు.
సరుకు మింగింది!
ఓడిపోయి వస్తున్నాడు.
మనిషీ! మనిషీ!!
నీకూ నాకూ మధ్య దూరమెంత?
ఏదో ఒక సరుకంత!
ఇపుడు జీవితంకన్నా సరుకు ప్రేమగొప్ప!
మనుషులంగడి సాగినాది
నీ విలువ, నిన్ను కొనేవాని చిరునామా
తెరమీద చూపుతారక్కడ
మార్కెట్ చిరునవ్వులన్నీ
నువు సరుకయ్యేంత వరకే!
ఇక ఏ ప్రవాహాలుండవు
అన్నీ ప్యాకేజీలే!
'థేమ్స్‌వాటర్' కంపెనీ పిడికిట్లో

'నీరు' గడ్డకట్టి పోయింది.
'భూమి' సరే! గాలీ భయపడుతున్నది
నన్నెక్కడ అమ్ముతారోనని!
అంగడి నీ ఎడమచేతిని కట్టేసి
నీ కుడిచేత్తో నీ గొంతును నులుముతున్నది
ఆకాశం నిండా దుఃఖం కురుస్తుంటది
ఎక్కడనో ఒక మనిషి
'కొడిజీవునం'తో వాకిట్ల నిలబడి
మొగులు దిక్కు జూసే కండ్లల్ల
వాన రాదు! ప్రాణం పోదు!!



## దాట్ల దేవదానం రాజు

# వికార రూపం

ఆదిమ గీతం ఆలపింపకు
నాదిప్పుడు ప్రపంచాధిపత్య సింహాసనం

నాకు చిరునామాలూ
కొండమీద ఎగరేసిన ఆనవాలూ వద్దు
శిధిలమైన దగ్ధమైన అశాంత పారాలూ వద్దు
కామించడానికి నాకే దేశమూ వద్దు
అందంగానో వంకరగానో సంతకాలు కావాలి.

దేశాలకు గుండెలెక్కడివి కుర్చీలు తప్ప.
మౌనముద్ర దాల్చే
ఎప్పటికీ గిరిదాటని కూర్చీలు కావాలి.

నా గుప్పెటలోకి ఇమిడిపోయే అర్థ విలాపాలు కావాలి

బలిమికోసం దాచుకున్న అస్త్రాల ఆచూకీ కావాలి
రూపాయిల చుట్టూ జనాల్ని తిప్పే
వ్యాపార బంధనాల్లో చిక్కుకున్నావా
అయినా సరే వ్యక్తులొద్దు నాకు.

నాదంతా తెల్లని తెలుపుల ఆత్మ
ఇప్పటి నా విగ్రహం సామ్రాజ్యవాదానికి ఇంకోరూపం

వలసపాలన ఒకప్పటి చరిత్ర
ఉదారవాదం వర్తమానం.

ఏజెంటుగా కాదు పరోక్షపాలనే అభిమతం
ఆలసించిన ఆశాభంగం
పెట్టుబడులు, అప్పులు నా సుందర తాజా ఉచ్చులు.

నా ఆఫ్ఘన్ యుద్ధం సమస్త మానవజాతిపై
ప్రేమాభిమానాలకు అంకితం
విశ్వశ్రేయస్సుకు నిదర్శనం.

కొత్త విలువలను సరికొత్త నైతికతను
అంచెలంచెలుగా విసురుతాను
నయా ధనవంతం మాయా సృష్టం

నా వ్యూహం ఎరవేస్తూ తప్పుదారి పట్టించడం
దివాళా తీయించి
నేనే దిక్కని స్తుతించుకుని నెత్తిమీద కూర్చోవడం
ఉగ్రవాదాన్ని భీకరనాదంగా నినదించి
సమర ప్రకంపనల్ని సృష్టించడం

ఒక అగోచర దృశ్యాల కుట్ర నా అంతరంగం

ఇరువురి మధ్య నెత్తురు నా వ్యాపారం
నా రాజీమార్గం

నాటకంలో వేదిక ఎక్కేది ఎపుడూ కొత్త పాత్రలే.

ప్రకృతి గతులు నా పేటెంటు హక్కు
సకల సహజ వనరులూ నా హక్కు భుక్తాలు
అనంత సజీవ సంచారమంతా నా బందీలే
కాదంటే- ఇనుప కౌగిలి బిగిస్తాను.

నేను ధర్మపాలకుడ్ని
నేను విశ్వరక్షక భటుడ్ని



## దార్ల రామచంద్ర

# స్వాహాతంత్రం

ప్రపంచీకరణ అద్దం ముందు
అసమానతల ప్రతిబింబం!
బాబు ఒంటరి పోరాటాల లడాయి
బిల్‌గ్రేట్‌తో కరచలనం బడాయి.
మన శతాబ్దాల ప్రగతంతా
ఆర్.టి.సి. బస్సులో ఫ్లస్టుఎయిడ్ బాక్స్ అంతనిజం!
సంక్షేమ కూటికుండని
గ్లోబల్ డాలర్ కుక్కముట్టి తింటుంది.
ఉద్యోగాల కోడిపిల్లల్ని
ప్రైవేటైజేషన్ రాబందు తన్నుకుపోతుంది!
ప్రపంచ మార్కెట్‌లో
దేశప్రణాళికల సబ్సీడీలని
బుష్ బుసకొట్టి బుస్సుమనిపిస్తున్నడు!
సంప్రదాయ యవసం సడలి
సమగ్ర సస్యరక్షణ చెయ్యి విరిగి
హరితవిప్లవం ఆగంజేసి
కార్పొరేటు వ్యవసాయం
ఎండమావిలో
పంటల నెతుక్కుంటున్న వాళ్ళం!
బహుళజాతి విత్తనాల కనిపించని కత్తికి
రైతుల తలలు తెగి నేలరాలుతున్నాయి.
చదువులకు కొత్త నిర్వచనం సృష్టించి
కార్పొరేటు చదువుల వృక్షాన్ని నాటి

రెసిడెన్షియల్ వ్యాపారపు కాయలని కాయించడం
ఆత్మహత్యల పూలు పూయించడం.
గ్లోబల్ స్టేట్ దళారినీ గట్టెక్కించడం!
రైతులకు, నిరుపేదలకు సంక్షేమ సబ్సీడీలొద్దు!
సంపన్నులు కట్టే బ్యాంక్ అప్పులు రద్దు!
నీ హైటెక్ - కంప్యూటర్
పోక్లెన్ యంత్రాల దిగుమతి
మాకు పెట్టగలదా! పొట్టకింతకూడు?
ఆకలి, క్షామాలతో అమెరికా వ్యాపారం
నీరు సైతం ప్రైవేటీకరణ రూపం దాల్చిన వాణిజ్యం!
ధర్మాధర్మాల నిర్వచనం మార్చబడి
అధర్మమే - ధర్మమై పరివర్తన చెందిన చోట!
అమెరికోని డాలర్లు
సామాజిక అసమానతల తలుపులు మూసినయ్
గ్లోబల్ విలేజి డోర్‌లు తెరచినయ్!
మానవ నైతికవిలువలు పతనమైన దెబ్బ
గరీబుల కడుపులోకి లేదు ఒక్క ముద్ద!
పబ్లిక్ ప్రాపర్టీ అడ్డికి పావుశేరు లెక్క అమ్ముడాయె
ప్రజల ఉపాధి కాస్త ఊడిపాయె!
ప్రజాస్వామ్యం
ఫుట్‌పాతులపై బాలకార్మికులని, (అనాధలని) నిద్దుర పుచ్చి
50 ఏళ్ళ స్వాతంత్ర్యంను వెక్కిరిస్తుంది!
తాకట్టు భారతంలో
సార్వభౌమాధికారపు నక్షత్రాలు
ఒక్కొక్కటిగా రాలి మరణిస్తున్న దృశ్యాలు!
తల్లీ స్వాతంత్ర భారతమా ఇటుచూడు?
స్వాతంత్ర్యం పోతున్న వేళ
చీకటి నీడలా స్వాహా స్వాహాతంత్రం వస్తున్నజాడ!



డా॥ దిలావర్

# ఒక నిశ్శబ్ద జ్ఞాపకం

అంటుకున్న రాత్రి మంటల్లో
కాలిన కలల వాసనతో
కుప్పకూలిన బతుకు లాంటి యిల్లు....
చెట్టంత నిట్టాడుచుట్టూ పరచుకున్న వాసాలమీది కప్పు
తుళ్ళిపడే ఎన్నికలలకు చల్లని నీడనిచ్చింది!
ఒకప్పుడు....
ఇంటి వసారా కట్టు కొయ్య పలుపులోంచి
చాపిన నాలుక మాతృత్వం కింద
లేగదూడల ఒళ్ళంతా ఎంత ఆర్ద్రంగా తడిసేది!
గద్దల గిరికీల వలలోంచి
గునగున నడిచే బుల్లి ప్రాణాలను తప్పించి
ఎంత ఒడుపుగా పొదువుకునేవి తల్లి రెక్కలు!
గోడకు ఆనించిన కోటేరులో
అయ్య కాయగాసిన భుజం మాదిరి
జీవితానికి ఎంత భరోసా ఉండేది!
పిట్టల పిసపిసలతో మేల్కొని
చల్లకవ్వానికి నృత్యం నేర్పిన అమ్మ చేతులు
ఆకలి కడుపును ఎంత ఆర్ద్రంగా తడిమేవి!
కళ్ళాపి జల్లిన లోగిలి; ముత్యాల ముగ్గుతో ఒక అజంతా చిత్రమయ్యేది!
ఆ యింటి ఏ గోడను స్పర్శించినా
ఒకటొకటిగా పేర్చిన మమతల యిటుకలే!
అక్కడ ఏ గూటిని తడిమినా

తగిలేది గుండె గూటిలోని చెమ్మే!
ఇప్పుడు ఏ నడిమంత్రపు జాలరో విసిరిన వడిశాల దెబ్బకు
కువకువలాడే ఆ యింట్లోని కలలన్నీ బెదిరి
అందనంత దూరం ఎగిరిపోయాయి.
చెట్టంత నిట్టాడు గుండె పగిలి కుప్పకూలిపోయింది
ఇప్పుడా ఇంటి గుండెకు
పని చేయని ధమనుల్లా అల్లుకున్న సాలెగూళ్ళు!
ఆ కప్పు కింద....
ఇప్పుడు ఏ గుండె చప్పుడూ లేని
తెగిన మధుర సంగీతపు ఒక నిశ్శబ్ద జ్ఞాపకం!



డా॥ నమమాసస్వామి

# హతాబ్దం

నేను పుట్టిన్నాడే యు.సి.సి. తోకచుక్క నింగికెక్కింది.
అంబాడే వేళ అంబట్లైతుర్రె ఇంటర్ అమెరికా కన్వెన్షన్
బెర్నేలో ప్రపంచీకరణ పరకాయప్రవేశం చేసింది
అలీన గడ్డపెరుగులో వలసవాద కవ్వం
తల చిలికిన చల్ల స్మృతి
వేలొంచి వెన్నతీసే నేర్పు గదా పాశ్చాత్యులది
గాట్ ప్రసవించిన మృతశిశువు డంకెల్‌డ్రాఫ్ట్ పిశాచి
కళ్ళలో భయం కదలాడుతున్నా
కంఠంలో జీరలు చారలవుతున్నా
కొంగుచాటు సరసమే దానిది
సావిట్లో సడేమియా బానిస జాతిలోడి రాజ్యం
చరిత్ర కెక్కిన వైనం
అప్రమేయంగానే సాలెగూట్లోకి విసిరేయబడ్డ
పరాయీకరణ తమకంలో లోకం
భూమ్మీద పాకాల్సిన కొండచిలువ నిటారుగా
ఆకాశంలో తలాడిస్తూ నిలుచుంది.
ప్రపంచ బ్యాంక్ వశీకరణతో అలీన దేశాల్ని
ఆకర్షించి ఆలింగనం చేసుకొంటోంది
ప్రపంచం మొత్తం మీద అమెరికా భయమే
పెత్తనం చెలాయిస్తుందిప్పుడు
ఎవరు ఎవరిమీద దండెత్తాలో
ఎవరు ఎప్పుడు యుద్ధం చేయాలో

అంతా వాడి కనుసైగల్లోనే జరిగిపోవాలి
అభ్యర్థి వాడే, ప్రత్యర్థీ వాడే
బరిలో దిగేది వాడే, బరి బయట నిలబడేది వాడే
అన్నింటిలో వాని మాయాజాలమే పెనవేసుకుపోతుంది.
'దాసోహం' పదం చుట్టే వాడి నిఘానిఘంటువు నిర్మితమైంది
శత్రువుని సునాయాసంగాగుర్తించడం తెల్సు
అదే సమయంలో శత్రువుని నిస్సిగ్గుగా రక్షించడం తెల్సు
వాడికి అన్నీ తెల్సు
వాడివీటో హక్కుకి మరిన్ని తెల్సు
యుద్ధం చేయకుండానే ప్రపంచాన్ని పాదాక్రాంతం
చేసుకోగల నేర్పువానిది
చిన్న చేపల్ని పెద్దచేపలు మింగే ప్రక్రియే 'పేటెంట్'.
అపౌరుషేయ ప్రయివేటీకరణ పరోక్షాయుధం అయింది
వి.ఆర్.ఎస్. కాంట్రాక్ట్ ఉద్యోగాలు వెదజల్లిన సంకర విత్తులే
డంకెల్‌డ్రాఫ్ట్ మీద సంతకించిన తక్షణమే సబ్సిడీలు స్మాష్
జాతీయ విత్తనాల రద్దు వల్లే రైతుల ఆత్మహత్యలు మొదలైనాయి
కాంపోస్టు ఎరువులపై రాయితీలు మాయగానే
రెండ్రూపాయల బియ్యం మాయం
ట్రాన్స్‌కో కాచుకోమంటూ పెంచిన ధరలకే గదా నిరసన వెల్లువై
బషీర్‌బాగ్ దుర్ఘటన చోటుచేసుకొంది
ఆసుపత్రి గీతం సేవా వృత్తిని మరిచి అర్థం పరమార్థాన్ని రాగంగా
ఆలపిస్తోంది
సర్కార్ స్కూల్లన్నీ 'కానీ' బదులుగా బహిరంగంగానే మారిపోయాయి
అనుబంధ కళాశాలలన్నీ స్వయం ప్రతిపత్తిలోకి కూరుకుపోయాయి
పరిశ్రమలు ఖాయిలాపడటం నిన్నటి మాట-కుప్పకూలిపోవడం నేటి
నిజం
స్వావలంబనం బ్యాలన్స్ తప్పి స్వయం ఉపాధి అటకెక్కింది
ప్రపంచీకరణ ముసుగులో కనిపించని దోపిడి-

ఉదాత్త అనురాగం పాలకుండలో చిలికిన
విష సంస్కృతి స్టాక్ ఎక్ఛేంజ్
సుస్థిర సంసార బంధంలో మూసలం శూర్పణఖ షేర్ మార్కెట్
సగటు అభివృద్ధికి హైటెక్‌లో లోటెక్
విశ్వాసఘాతుక ఇన్ఫర్మేషన్ టెక్నాలజీ
నిర్నిమిత్తంగా నిష్కారణంగా స్పృహ రహితంగా
ప్రజల జీవితాల్ని తాకట్టుపెట్టే విజన్ 2020.
కళ్ల గుండా కాంతాల్ని సోకించి నరాల్లో నల్లమందు నెక్కించే టీవీ చానళ్ళు
అన్నంపెట్టే ఇంటికే కన్నం వేసే అర్బన్ కోపరేటివ్ బ్యాంకులు
పంట పొలాల్ని ఫిలింసిటీలకి, పబ్లిక్ పార్క్‌లకి విమానాశ్రమాలకి తార్చే ప్రభుత్వం.
సింగపూర్ సింగినాదం జీలకర్ర స్వర్ణాంధ్ర నినాదం
మలేసియా ఆదర్శం మసిబూసిన మారేడుకాయ మెట్రోసిటి రాజధాని
ఉద్యమించకుండా ఇంకొన్నాళ్ళ తాత్సారం చేస్తే
ఆంధ్రులంతా ఆదిమవాసులు అయ్యేది ఖాయం.



## నందిని సిధారెడ్డి

# బహు(ళ) దాహం

అందరు నిద్రలో వున్నప్పుడు
హఠాత్తుగా మెలకువొచ్చి అతను
ఇల్లంతా చిన్నపిల్లాడిలా తడుముతుంటాడు
కష్టపడి కట్టుకున్న నాగటి దుంప కనిపించక కలత పడుతుంది

ఎన్నేండ్లొచ్చినా లోకం తెల్సుకోని ఎడ్డి మనసు
తంగెడు పొదలో దాసుకున్న సీతాఫలాలు తలపుల్లోనే మిగులుతాయి
చింత తోపులో ఎంత వెతికినా
గొర్రింకల గునగునార్భటుల గుర్తులన్నా ఉండవు
చొప్పజూడులో జొన్నకంకి మాయమై
చెరవోయి పండించిన రైతుకంట్లో కోసిన కొయ్యకాళ్లే గుచ్చుకుంటాయి

కోడి కూస్తుందని ఎదురుచూసి
అద్భుతమైన ఉదయాన్ని కోల్పోయాడు రైతు
ఫారం కోళ్లకు ఎప్పుడు కూయాలో తెలియదు
షెడ్డులో బంధించబడి
లైట్ల వెలుగులో వాటికి రాత్రీ పగలు ఒక్కలాగే వుంటాయి

చాకిరీ చట్టుబండలు మోసి మోసీ
నడుములు విరిగినట్లు
రైతు కలలు ఎప్పుడో విరిగిపోయాయి
రైతు బతుకులో ఇప్పుడు ఇసుకమేట వేస్తున్నది
తెలివిమంతులు ఉపాయశాలి మేధావులు
పెట్టే ఉరుల్లో చిక్కుకుని అతను వలపోస్తున్నాడు

ఋణాలిచ్చి తనతోనే గోతులు తవ్వించి
అతని కష్టాన్ని పాతర వేస్తున్నారు
ఇనుప మొఖం వాడికి ఎంత పెత్తనమైనా చాలదు
ఇక్కడి విత్తనాలు వాడిష్టమేనట
వాడిష్టంతోనే ఇక్కడ పంటలు పండాలట
భూమ్మనదే కష్టమ్మనదే
వొచ్చే సర్వసంపద మాత్రం వాడిదట

❀ ❀ ❀

బతుకమ్మ పండుక్కి తంగెడు పువ్వు దొరక్క
తబుకు చిన్నవోతుంది.
దసరా హుషారులో జెండా కింద జొన్నకర్ర దొరకక
ఊరు నిట్టూరుస్తుంది
జంబీ జాజిపత్రి ఏవీ ఉండవు
సంక్రాంతి గొబ్బిళ్లముందు ఏ ధాన్యం పెట్టాల్సి వస్తుందో
ఇగ ముందు మనకెవరికీ తెలియదు
పిల్లలకి కోతికొమ్మచ్చి ఆటే వుండదు అన్నీ నీలగిరి చెట్లే మరి
అన్ని రంగాలు వాడి ఫైల్లో కాయిదాలయ్యాయి
ఇగ - వ్యవసాయం వెంబడి బడ్డాడు
రైతులో ఇంకా ఏం మిగులుందని కొల్లగొడతారు
భోలాశంకరుని బొమికెలమీద
ఒక దేశం పాలకులు ఇంకొక దేశం విడిచిన బట్టలు ఆరేస్తారు
వ్యక్తిత్వం లేని రాజకీయులకు అమ్ముకోవటమొక్కటే గదా తెలిసింది
అమ్ముకోండి ఆత్మను అమ్ముకోండి
రైతు నోట్లో కొట్టటానికి ఇంత మట్టికూడా అమ్ముకోండి
దేశ గౌరవం గురించి మందిరమంత నోటితో అరిచేవాళ్లకు
తాకట్టు పడుతున్న రైతన్న తలపులోనన్నా రాదు
రాసివ్వండి మీ ముల్లేం పోయింది - రాసివ్వండి

కష్టాన్ని నమ్ముకున్న నేరానికి మట్టిని నమ్ముకున్న పాపానికి
నోరులేని అతని బతుకుమీద అన్ని హక్కులూ రాసివ్వండి

ఇక్కడ మొలిచే మొక్కల మీద తీరైన చెట్ల సోయగాల మీద
పులకించి వొయ్యారంగా వూగే పంటచేల మీదా
కిలకిలలాడ్తూ ఎగిరే పక్షుల మీదా అవి తినే పాలగింజల మీదా
మీ పాపాలు రాసివ్వండి

రైతు బతుకులో ఇంకేం మిగిలిందని
గడకీ మంట పెడతారు
ఒక్కసారే అతన్ని తగలబెట్టి చలిగాసుకోండి
మీ ఢిల్లీ పీఠాలు వెచ్చబడుతాయి
మీ కార్లు భద్రం
స్విస్‌బాంకులో మీ ఖాతాలు భద్రం
మీ కొడుకుల రాజకీయ భవిష్యత్తు భద్రం
మీ భార్యల బంగారు వన్నె వెన్నె ఆభరణాలు భద్రం
సంపాయించటమొక్కటే గదా ఏలినవాళ్లకు తెలిసింది

రైతన్నా!
నీతిలేని వాళ్లు పాలించే రాజ్యంలో పుట్టినందుకు
బాధపడాల్సింది మనమే
సిగ్గులేనివాళ్ల చేతిలో అధికారం పెట్టినందుకు
సిగ్గుపడాల్సింది కూడా మనమే



## నాళేశ్వరం శంకరం

# కరెన్సీ ఖడ్గం!

సరళీకృత సంగ్రామ కాలమిది
పడగవిప్పిన నాణెం ముందు
ప్రపంచమే ఆడుతున్న రోజులివి
ఎవరి మనో మౌన లోయలో ప్రవేశించినా
మనీ మార్జాల వాసనే!
కాసుల స్తంభంమీద రెపరెపలాడే
ఆసేతు హిమాచలంలోనూ
ఆవలిస్తున్న అభినవ రూపాయి సింహగర్జనే
పెదాలమధ్య కదిలే ధనలోలకానికి తెలిసినంత ధనుర్విద్య
మరే మృగలోలకానికీ తెలియదు

దేశాలన్నీ చీమల పుట్టలైనా ధనసర్ప నిలయాలే
చీమలు సర్పాల్ని కాటేస్తాయనటం కల్ల!
సర్పాలే చీమల్ని కాటేస్తాయనటం పచ్చివాస్తవం
ఒకదేశపు ధనసర్పం
ఎప్పుడు యే దేశపు పుట్టలో చొరబడుతుందో తెలియదు కానీ
ఉదయాస్తమయం వెలిగే మనోస్వప్న సీమలో
కరెన్సీ కళేబరాల శబ్ద సంభాషణల్ని మాత్రం వినగలం

కల్లోల కాముకపు దృశ్యాల్లోనే కాదు
రంగులు మార్చే సినీతెరల మీద
కదలాడే రూపాయి అవయవాల్లోనూ
ఇంట్లో పీఠం వేసుక్కూచున్న మనీజననాంగాల్లోనూ

వెంటాడే వ్యాపార మనోమర్మాంగపు
విధ్యంసాన్ని అనునిత్యం చూడగలం
ఎవరు ఎవరి విధ్యంస హింసను ధిక్కరించినా ఫర్వాలేదు
రూపాయి పొట్లంలోని రూపాయి బాకుతో తలపడినా ఫర్వాలేదు
దానికి కావల్సిందల్లా
దాని మోసాన్ని ప్రశ్నించకపోవటమే
దాని విధ్వంసాన్ని ధ్వంసం చేయకపోవటమే!

అందువల్లే కదా
నాణెం బరువుకింద నాయనమ్మ లేదు
ముద్దులొలికే మునిమనుమడు లేడు
వీధిలో తగలబడుతున్న ఆడవాళ్ళుగానీ
పోరులో ఉడుకుతున్న 'అంటరాని' వాళ్ళుగానీ అంతకన్నాలేరు
నెరవేరని దాంపత్యాల్లోనూ
కరిగిపోతున్న ప్రేమికుల్లోనూ
తాజ్‌మహల్ ఎప్పుడో విధ్వంసమైపోయింది

నాణానికీ నాణానికీ ఉన్న సంబంధమే
మానవ సంబంధమైపోతున్నవేళ
లిప్తపాటు కునుకులోకూడా
కరెన్సీ ఖడ్గమే వెంటాడుతుంది
రూపాయి పూనకంలో
భూగోళమే విలీనమైపోతున్న సమయాన
మినిషో లెక్కా
వాడి తలమీద మూడోపాదం మోపే
పప్పుదినుసుల ధరలో లెక్కా
మార్కెట్ మంటల మీద
సలసల కాగుతున్న నూనెలో లెక్కా
ఊళ్ళను ఊడ్చుకుపోయే షేరు భూతాలో లెక్కా

రగులుతున్న ధరలెప్పుడూ
రణనినాదాలు తప్ప రణం చేయవు.
సరళీకృత రూపాయినేకాదు
సబ్సిడీ రూపాయినికూడా మార్చలేవు
ఇప్పుడు మనిషంటే
నిలువునా నడిచే రక్తమాంసాలు కాదు
పల్లానికి దొర్లుకుపోయే గుండ్రని రూపాయి నాణెం మాత్రమే!



## పరిమళ్

# పరుచుకుంటున్న వల

సముద్రకల్లోలంల
మునిగితేలే పడవలౌతున్నరు
ఎవరో ఒకరు చెట్టులాగ
చాలామంది ఎడారులే
సాఫ్ట్‌వేర్ సందడిలో
కులం ఎంతో సొగసుగా.... మాయగా...
నల్లగాలివీచినట్టు మాటలు
ముఖంకుండకు
రాయిలా తగిలి కన్నీళ్ళు....
అప్పుడు చెప్పులుకుట్టీ తొడగలేదు
షాపులో రంగుల్తో నవ్వుతూ కాబ్లర్స్
కొలువెక్కిన మాజంపన్న కొడుకు
ట్వింకిల్ ట్వింకిల్ లిటిల్‌స్టార్ పాడ్తుండు
బర్రెమీదెక్కి
ఇది తోలుతిత్తిరాజీవా అంటూ మావోడు
కంప్యూటర్ ఫ్యాన్ కింద
సేదతీరేడెవ్వడు?

తైదంబలివోసిన ఎక్రపొలం
గ్లోబల్ పురుగు కాటుకు
పత్తికాయలా... రాలె
అమెరికన్ యింజన్‌తో
సదువులబండి ఉరుకవట్టె

కరెన్సీ టిక్కట్‌కే సీట్లు
గుడ్డి దీపాల హాస్టల్ సదువులు
గంగలో కల్వవట్టె
సేన్లల్ల సెల్కలల్ల
రాత్రిపూట ఎన్నెట్ల
బతుకు వెలుగునీడల జానపదాలు
గొంతులో గుబాళించడంలేదు
కేసెట్ల పంజరంలో ఏడుస్తున్నై
అట్టడుగు మనుషులమధ్య కూడా
పల్లెబంధం తెగిపోవట్టె
ఇప్పుడు గుండె
పైసల గల్ల బుడ్డి కావట్టె
నీడనిచ్చి
చిరునవ్వులు చిందే మనిషి
సాలీడులా
బతుకుతీగలు అల్లుతున్నాడు
రేపు అవి విద్యుత్ తీగలవుతాయి
భవిష్యత్.... బూడిదవుతుంది.

## పి. అనంతరావు

# అగ్నిశ్వాస

ఇక్కడ దేశభక్తి ప్రవాహం నరాల్ని చీల్చుకొని
ఉప్పొంగి, సంకెళ్లు తెగిపడ్డ తరువాత
పోరాటగాథల పరిమళం ఈ నేలంతా అల్లుకున్న తరువాత
ఈ నేలమీద మానవత విశ్వరూపం దాల్చింది
పాదాలు ఆ గతంలోకి నడుస్తున్నాయి
మతం అసమ్మతమయింది
సీమదొరల తరువాత దేశపటం చుట్టూ దుశ్శాసనులు కాపలా కాస్తున్నారు
ఈ దేశం ఎవరిది?
అందరం ఒక తల్లిపాలు తాగిన అన్నదమ్ములమే
సారాంశాలన్నీ నెత్తురు మడుగులవుతున్నాయి
వార్తల్లో, చర్చల్లో మడుగుల గురించే ప్రశ్న
మడుగులన్నీ అలలైన శోకసముద్రంలో
కొత్త సమాజం ఉద్భవించదు
గ్లోబలీకరణ సరళీకరణ సామ్రాజ్యవాద బంధాల్ని
దుశ్శాసనులు దేశపటాన్ని బిగించి
ప్రజాస్వామ్యం చుట్టూ బొంగరంలా తిప్పుతున్నారు.
దొంగల కార్ఖానాలు నిర్మించి స్వేదఘోష వినిపించకుండా
దేశ పటాన్ని వాయిదాల్లో తాకట్టు పెట్టి రుణాలు ప్రణాలుగా చేస్తున్నారు
నాకు ఊహతెలిసినప్పటి నుంచి దుశ్శాసనుల్ని పసిగడుతూనే ఉన్నాను
అందుకే
దేశభక్తి సూర్యుళ్లందరూ జ్వాలాతోరణాలై
స్వేద పతాకాన్ని ఎగురవేయడానికి
అనుక్షణం అగ్నిశ్వాసల్ని అక్షరాలుగా మండిస్తున్నాను.

## పి.ఆర్.ఎల్. స్వామి

# అతలాకుతలం

మాటల్లో తియ్యదనం లేదు....
ముఖం నిండా మో'డల్' మేకప్...
మట్టి వాసనలాంటి సంభాషణలు లేవు....
అప్పుల 'కోలా'హలంలో హైటెక్ అనారోగ్యాన్ని పెంచుకుంట్యూ....
అనుభూతులు కోల్పోయి కరెన్సీ కన్నీళ్ళు కారుస్తూ....
ఇంటర్నెట్ తట్టిలేపితేనేకాని తెల్లారని శుభోదయం...
ప్రకృతితో పులకరించాలన్నా కంప్యూటర్‌తోనే పలకరింపు...
హలో! హాయ్!లు తప్ప కరువైన ప్రేమకరచాలనం....
సంస్కృతి సంప్రదాయాల పేరెత్తితే చూపుల్లోనే వెటకారం...
లిప్‌స్టిక్ పెదాలకు అంటీ అంటని నవ్వులు...
ఇంటినంతా ప్లాస్టిక్ పూలమొక్కలతో
మొలకెత్తించి ఆక్సిజన్‌కోసం వెంపర్లాట....
ఉత్తరాలే లేవు! చెత్తరాల్చే కంప్యూటర్‌లోనే క్షేమ సమాచారం
సెక్స్ మార్కెట్ చుట్టూ
ప్రదక్షిణలు చేస్తూ....
కలిసి బతకాల్సిన మనుషులు ఒంటరి బతుకు మెతుకునే ఏరుకుంటూ..
విలేజ్‌లో కూడా గ్లోబల్‌గా కోల్పోయిన చిరునామానూ
ఎవరికివాళ్ళే వెతుక్కుంటూ.... గ్లోబలైజేషన్‌లో కూరుకుపోతూ....
కూ....రు...కు...పో...తూ....

## బత్తుల వీ.వెం. అప్పారావు

# మనకిప్పుడు ఏ "విలువ" లూ లేవు

సోవియట్ శిథిలమైంది, అమెరికా యే మిగిలింది
ప్రపంచాన్ని వెన్నముద్దలా మింగేయటానికి
దానికి యిప్పుడు అడ్డే లేదు, కాకుంటె నోరు పట్టడం లేదు
వెన్నముద్ద అనుకున్నంత మెత్తగానూ లేదు
గరికపోచలనుకున్న వాళ్ళంతా పదునుగా అడ్డు తగులుతున్నారు.
స్నైపర్‌మాన్ సీరియల్ హత్యలతో కునుకు లేకపోయినా
ఇరాన్ మీద దాడికి బాంబులున్నాయి.
తీర్మానాలు చెయ్యడానికి అనువుగా సమితి ఉంది.
కోరస్ టోన్ కోసం టోని బ్లేయర్ ఉన్నాడు.
సద్దాం ప్రపంచానికే శత్రువు, దోపిడీకి లొంగని వాడెవ్వడైనా అంతేలే
అమెరికాకి దక్కనిది ప్రపంచంలో ఏదీ ఉండరాదు
అమెరికా మిత్రులారా ఏకంకండి, అమెరికా ఆయిల్ దాహం తీర్చండి
అమెరికా మిమ్మల్ని పెద్దన్నల్లా కాపాడుతుందిలే.
ఆఫ్ఘనిస్థాన్‌ని తవ్వి లాడెన్‌ని పట్టుకోలేకపోయినా
అమెరికాకి సిగ్గులేదు. దానికి పుట్టుకలోనే లేదుకదా!
బుష్మాసురుడు ఆఫ్ఘన్ పై చెయ్యిపెట్టినా సాధించింది బూడిదే.
ఆఫ్ఘనిస్థాన్ సంగతి అయిపోయింది, యిప్పుడు వంతు ఇరాక్‌ది
దేశదేశాల్ని దోచి సాధించింది తక్కువేమీ కాదుకదా!
తన భూభాగంలో నష్టపోయింది ఎప్పుడు ఏమిలేదు కదా!

బద్ది నాగేశ్వరరావు

# భవితకు గొడ్డలిపెట్టు!!

ఆనాటి మా తంతి కార్యాలయం పగలూ రేయీ ఒకటే సందడి!
పకపకలూ వికవికలూ కొండొకచో పగలూ ప్రతీనలూ
అయినా క్షణ క్షణం చైతన్యభరితం!!
టెలిప్రింటర్ల టపటపలు ఫోనోగ్రాముల హలో హలోలు
పల్లెల్ని కార్యాలయానికి సంధిస్తూ
టెలిగ్రాఫ్ 'మార్సు'ల కడ-కట్టలూ ఒకటే వార్తల జలపాతాల హోరు!
దీనిముందు ఆర్కె బీచ్ బంగాళాఖాతం కెరటాల హోరు బలాదూరు!!
ఏదీ ఆనాటి కోలాహలం?
ఏమిటీ ఆధునికీకరణ హాలాహలం??
ఈనాడూ అదే కార్యాలయం విశాలంగానే కానీ అందులో శాల్తీలే లేరే
గ్లోబలైజేషన్ పుణ్యమాని
ఎమ్. టీ. యమ్ ముందు ఒకడే ఆపరేటర్
ప్రపంచం నలుమూలల నుంచీ అటూ ఇటూ వార్తల బట్వాడా
ఆధునికీకరణ సమంజసమే
మార్పు అనివార్యమే
ప్రత్యామ్నాయం యోచించడం ప్రభుత్వ తక్షణ కర్తవ్యం
ఆధునికీకరణ పేరుతో నిరుద్యోగుల్ని పెంచడం
మానవశక్తిని నిర్వీర్యం చెయ్యడం
యువత భవితకు గొడ్డలిపెట్టు!!

బి.ఆర్. భగవాన్‌దాస్

# ఒక్కటౌదాం మనం

ప్రపంచీకరణతో పతనం ప్రారంభమై
ప్రమాదం అంచున దేశ ప్రజలు
ప్రైవేటీకరణతో పగుళ్ళు ప్రారంభమై
పతనం వైపు ప్రయాణం
స్వేచ్ఛా వ్యాపారంతో చెదలెక్కుతున్న దేశం
కలిమిని సృష్టించే కర్మాగారాలను అమ్ముతూ
లేమిని ప్రోత్సహిస్తున్న నేటిపాలకులు
కార్మికుల, విద్యార్థికుల, సాంకేతిక నిపుణుల
మొర ఆలకించక మెడలు వంచి
బజారుపాలు చేస్తున్న బలప్రయోగులు
నరభక్షక అమెరికా నాట్యం చేస్తుంటే
ఆలింగనం కొరకు అదును చూస్తున్న సర్కార్
దూరదృష్టి కోల్పోయి ధృతరాష్ట్ర కౌగిలికి ఆహ్వానం
ఆగదు.... ఆగదు.... సాగుతూనే ఉంటుందన్న సర్కార్
ఊళ్ళు నిర్మించలేదు - పోరు సలపలేదు
ఉపాయాలతో దేశాన్ని ఊడ్చేస్తున్నారు.
అపాయం అంచున ఆశతో జనం
మృత్యువాతపడి మృతదేహాలయ్యారు
యన్.డి.ఎ. పాలనలో
ఏడుస్తున్న ముఖాలు ఎండమావుల బతుకులు
ఏవంక చూసినా చెదిరిపోతున్న జీవితాలు
అలీన విధానం అంటరాని దంటున్నారు

జాతీయాభివృద్ధి మాట వద్దంటున్నారు
పట్టు బిగుసుకున్న ప్రైవేటు వర్గం
పాటుపడే కార్మికులపీక నొక్కేశారు
శాసనాలింకెక్కడివి - సంకెళ్ళే మిగిలాయి.
విధాన సభల్లో రోజూ వింటున్నాం
ప్రైవేటీకరణ, ప్రపంచీకరణ, సరళీకరణల సంబరాల చర్యలు
మెట్టు పై మెట్టెక్కుతున్న పెట్టుబడుల ఉపసంహరణ
పట్టుబట్టి పబ్లిక్ రంగాన్ని పాతాళానికి నెట్టిరి
విచిత్ర విన్యాసాల వింతగొలిపే పాలకులు
దోషులనబడే వారే దేశానిర్ణేతలైరి
అధికారముంది గాని హక్కెక్కడిది వీరికి
డొక్క చీల్చుదామంటూ ఒక్కటౌదాం మనం

భగ్వాన్

# పొల్లుగింజ

ఇకనుంచీ చెట్టూ గొడ్డూ పల్లెవి కావు
నాటాల్సిన విత్తనమేదో చల్లాల్సిన ఎరువేదో
అమ్మాల్సిన పంటకెంత ధరో....
ముందుగానే జరిగిపోయిన ఏకపక్ష నిర్ణయాల మధ్య
ఇకనుంచీ రైతుపేరు వెన్నెముక కానే కాదు
కర్ర పుచ్చుకున్న ధనిక దేశం మోళీ వాడి ముందు
మనం కోతుల్లా ఆడడం మొదలెట్టాకా
పల్లె పల్లెలా ఉండదు. పల్లె పల్లెలో ఉండదు
బిక్క చచ్చిన చూపులూ తడారిన గొంతుకలూ
దరహాసాల తుమ్మెదలు వాలని పెదాలూ
పల్లె ముఖచిత్రం మీద ఉలిపిరికాయలుగా మొలుస్తాయి
రాత్రి పల్లె కనే కలలకు తెల్లారకుండానే అబార్షనవుతుంది
పెరటిచెట్టుమీద వాలే పక్షుల కువకువల కులాసాలూ
పాక చుట్టూ పశు శిశువుల చెంగు చెంగుల సౌందర్యాలూ
పరిగలేరే పసి వయసుల కిలకిలల అనుభూతులూ
వరిచేల మీంచి వీచే బృందగాన తెలి తెమ్మెరల సోయగాలూ
పిడకల దాలిలోంచి ఎగిరే పాలపొంగు పరిమళాల పరవశాలూ
తనువంతా తడిమే దృశ్య సంపదలన్నీ దోపిడీ అయ్యాకా
పల్లె బిడ్డకు బాల్యముండదు, పల్లె పడుచుకు యవ్వనముండదు
పల్లెత్తు పలకరింపు పల్లెలో దొరకదు
ఏ జబ్బుకు ఏ మందు ఎవరి దగ్గర ఎంతకు కొనాలో
నిర్ణయం ఖండాంతరాల వాడికిచ్చాకా
తలనొప్పి కూడా ఖరీదైన జబ్బే

పల్లె ఆరోగ్యం మీద క్రిములు పాకుతాయి
తొలిసారిగా పరికిణీ కట్టిన పాపలా మురిసే పల్లె
మాయల మాంత్రికుడికి చిక్కిన
బాలనాగమ్మలా బావురుమంటుంది
మంచు గుర్రమెక్కి వచ్చిన తెల్ల వ్యాపారికి తల వంచాకా
కుమ్మరి చక్రమూ తిరగదు. కమ్మరి కొలిమీ వెలగదు
అట్లతద్ది ఆరట్లూ ఉడకవు. గొంతెమ్మ పండుగా జరగదు
బడి గంటా మోగదు. గుడి స్పీకరూ పాడదు
చూరులకు కంకుల తోరణాలు వ్రేలాడవు
కార్తీక వన సంతర్పణల సంబరాలు ఉండవు
గంగిరెద్దులు అయ్యగార్లకు దండాలు పెట్టవు
ఆనవాయితీలన్నీ దారితప్పి
ఆత్మీయతా స్పర్శలు మూర్ఛపోతాయి
బట్టలు కుట్టే చలపతీ, పాలకేంద్రం పాపారావూ
బడ్డీ హోటలు చంద్రరావూ, టముకు వేసే పైడితల్లీ
ఒక్కొక్కరూ పొట్ట చేత్తో పట్టుకుని పల్లె విడిచి పోతారు
పల్లె తినే తిండి మీదా, పల్లె కట్టే బట్ట మీదా
పల్లె పీల్చే గాలిమీదా, పల్లె తాగే నీటి మీదా
ఎంత రాయల్టీ వసూలు చేయాలో
విదేశాల నుంచి ఆదేశాలు దిగుమతి అయ్యాకా
కొడవలీ గునపమూ నాగలీ గొడ్డలీ తుప్పుపట్టి అటకెక్కుతాయి
వడ్లబండి రిక్షాబండిగా చిన్నబోతుంది
దాణాలేని పల్లె పశువులకు వాల్‌పోస్టర్లు కమ్మగా రుచిస్తాయి
గూటీబిళ్ళా ఆడిన చేతులు హోటల్ కప్పుల్ని కడుగుతాయి
పల్లె చివికీ చితికీ పట్టణ ముఖంగా కుంటుతుంది
గ్రామీణ సంస్కృతి నశించి వలస సంస్కృతి వెలిశాకా
నీటికోసం తవ్వుకున్న గోతులే సమాధులవుతాయి

డా॥ మానేపల్లి

# ముఖ ముఖాలు

పనిమీద వీధిలోకి బయల్దేరుతున్నాను గనుక
జేబులో రెండుమూడు ముఖాలు వేసుకుని బయల్దేరాను
బొత్తిగా ఒక ముఖంతో పనులు జరగవని
బాగా అనుభవం మీద తెలిసి వచ్చింది
దోవలో ఎదురైన మనుషులు రకరకాల ముఖాల్లో కనిపించారు
కొందరివి ఎందుకో చెల్లని ముఖాల్లా కనిపించాయి
పాపం వాళ్లు ఏ ముఖం పెట్టుకుని బతుకుతున్నారో
కొందరు ముఖం ఎత్తుకుని గర్వంగా నడుస్తున్నారు
నేనొక పెద్దమనిషి ఇంటికి వెళ్లాను
నన్ను చూస్తూనే గబగబా లోపలికి వెళ్లి ముఖం మార్చుకుని వచ్చాడు
మంచిదే - ఈలోగా నేనూ నా ముఖం మార్చుకున్నాను
వచ్చినపని చెప్పాను
నాతో మాట్లాడుతూకూడా చిత్ర చిత్రంగా ముఖాలు మార్చాడు
అంత బాహాటంగా ఎలా ముఖాలు మారుస్తారో!
నా పని కాలేదు
ఏదో నాదగ్గిరా రెండు ముఖాలున్నాయిగాని
బహుముఖ ప్రజ్ఞావంతుడితో నేను చాలగలనా?
వెధవ ముఖం వేసుకుని తిరుగుముఖం పట్టాను.
ఎంత ఇంట్లో వున్నా ఒక్క ముఖంతో బతకడం కష్టమే
అవసరాన్ని బట్టి దుస్తుల్లా, ముఖాలు మార్చడం తప్పుకాదు
బహుశా మార్చకపోవడమే తప్పు గావును
ఇద్దరు ముగ్గురికి కలిపి ఒక్క ముఖమే వుంటే
అంత నికృష్టపరిస్థితి మరోటి వుండబోదు
కొత్తగా భూపతనమైన శిశువుకు మాత్రమే
అందమైన నిర్మలమైన ఒకే ఒక ముఖం వుంటుంది.

## డా॥ మిరియాల రామకృష్ణ

# సృష్టికర్తకో ఉత్తరం

ఉదార చరితానాంతు వసుధైవకుటుంబకం
అదేనా మీరానాడు మా శ్రవణాలలో
మంత్రమంటూ కరిగించిపోసిన అమృతం?
యంత్రాలు అన్నీ కలిసి ఇప్పుడు నాచెవుల్లో
వద్దువద్దన్నా నయాగరా జలపాతమంతటినీ
ముద్దకట్టి ఏ విషవినోద కేళీలీలా
విహాయసాన్నో కూరుతున్న 'ఈ సంఘటనని'
అహోరాత్రాలూ వర్ణించి వర్ణించి చెబుతున్నా
వినిపించుకోరేం పట్టుపీతాంబరధారి అయిన బ్రహ్మగారూ!
వినిపించుకుని మీరు మాత్రం ఏం ఉద్ధరిస్తారు?
ఇక్కడ విజ్ఞానమయకోశాలూ ఆనందమయకోశాలూ
ముక్కిపోయి, 'ఋషిపక్షుల' రెట్టల వాసనలు కొడుతూ
మా పంచేంద్రియాలనూ మావి కాకుండా చేస్తూంటే!
శాపం పెట్టి ఎవరోపోయి ఉంటారని మీరు
మమ్మల్ని ఓదార్చాలనుకుంటే ఆ పప్పులుడకవింక
చెమ్మగిల్లిన ఈ కోట్లాది నయానాలలోంచి
లావా ప్రవహిస్తోంది ఎందుకంటే ఇక్కడ
చావుకే తప్ప జీవితాలు కనిపించడంలేదు.
ఎక్కడున్నారు మీరు సృజించిన ఉదారచరితులు?
చక్కగా మంచి పనులుచేసి, స్వార్థం 'కాశీ'లో
వదిలేసి 'పునర్జన్మలు'లేకుండా చేసేసుకుని
నదీ నదాల్లా నదీ నదాల్లా నదీ నదాల్లా

కలిసిపోయారు "శ్రీకైవల్య పదాంబోధు"ల్లో:
తలలూ తలపులూ "వేరు వేరుగా వేరు వేరుగా"
పుట్టిన పరాన్న భుక్కులు, పదార్థ భుక్కులు.
తుట్టెలు తుట్టెలు 'బియ్యపు పురుగు'ల్లా
మిగిలిపోయి, మిగిలిపోయిన ప్రపంచమిది.
నిగనిగలు మాడిపోయిన, మారిపోయిన
మరోరంగు బంగారవుటుంగరమిది.
తరాల తరవాత తరాల తరవాత తరాలు
తరతరాల 'తలరాతలు' చెరిగిపోయిన కాలమిది.
భలేవారండీ బ్రహ్మగారూ 'సహనావవతు మంత్రం'
అలా అలా ఎక్కడికో ఎక్కడికో ఎగిరిపోయింది.
ఉదార చరిత్రుల్ని మీరు మళ్లీ కనిపెట్టాల్సిందే
ఇదేమిటనకండి మీరు పిల్లల్ని కని, ఇక్కడ పెట్టాల్సిందే.

**యస్. మునిసుందరం**

# ఇదేందబ్బా!

సరిగ్గా యిలాంటిరాత్రే
చెంద్రుడు సెలవు పెట్టిన రాత్రి
చుక్కలు కునుకేసినరాత్రి
ప్రాణులు, ప్రేమలు నిద్రించినరాత్రి.
నా హృదయ దీపాన్ని పోగొట్టుకున్నాను.
అటూ యిటూ అన్వేషిస్తూ...స్తూ...స్తూ...
వార్తలు చదివి జ్వరం తెచ్చుకున్న పిల్లకాకి
వొకటి కొంటే వొకటి ఫ్రీకై యెగబడే వెర్రిగోల
ట్రాన్స్‌పెరెంట్ వ్యవస్థ నింపినపొగలో
మధ్యతరగతి టాటాలు సీయూలు.
పైసలు కలుపుకుని ప్రేమను తింటున్నారేంది
వెన్నెముకలు విరిగిన యీ అభాగ్యులెవరు
అప్పు చంపిన శరీరాలా యివన్నీ
పురుగుమందు మనుషులు తాగారా
అన్నం చుట్టూముసిరిన ఈగల్లా
యెవరివీ అస్థిపంజరాలు
మట్టిపై యీ జీవచ్ఛవాల గోరీలేంది?
చెమట చుక్కలు తుడుచుకుంటూ
వేపచెట్టు నీడను చేరిన నేను.
"కూర్చోడానికి అనుమతివుందా!
వేపచెట్టు పేటెంట్ చేయబడెను."
బోర్డు చూసి అవాక్కయిన నేను.

యెముకలు నుజ్జునుజ్జు అయిన అనుభూతి.
డబ్ల్యుటీవోనుండి అరువు తెచ్చుకున్న ఆక్సిజన్ పీలుస్తూ
గతజ్ఞాపకాలు గుండెను కాల్చుతూంటే
వెబ్‌సైట్... యింటర్‌నెట్...కంప్యూటర్‌గాడ్...బిల్‌గేట్
డాలర్ వుక్కుకౌగిలిలో యువ ఆశలు.
మెన్ ఆర్ మేడ్‌యిన్: అమెరికా
అప్పుల వూబిలో యిండియా డాట్‌కామ్
చాట్...చాట్...మాయాజాలంలో
బీట్...బీట్...మెలోడీబీట్
భజనలో మునిగిన భరత పుత్రులు.

## రవి కుమార్

# ప్రపంచీకరణ - పెనురక్కసి

మనిషి శ్రమను తీయగా చప్పరిస్తుంది.
తింటుంది ఎముకలను - కండరాలను ద్యాకులా అయి
ఆబగా జుర్రుకుంటుంది రక్తాన్ని జలగలయి
ధన దాహంతో కలిసిన సామ్రాజ్యవాదం
దానికి మేధస్సులు కటిక చేదుగా వుంటాయి
అందుకే వాటి ఎదుగుదలకు వేస్తుంది వేటు
ఉప్పు పాతర వేసినా... ఊడిన పన్నులతో లేస్తుంది ఇకిలిస్తూ
సంకెళ్ళతో బంధించినా - ఖననం చేసినా - నిలువునా కాల్చినా
శ్వాస ఆపదు. వృద్ధి అవుతూనే వుంది మిలియనుల వైరసులయి
తిరిగి ఒక్కోసారి ఒక్కొక్క క్రూర హింసయి
ఒకసారి వ్యాపార హింస - ఒకసారి ఆధిపత్య హింస
ఇప్పుడది ప్రపంచీకరణ హింస కన్నులను అగ్ని బుగ్గలా తెరిసింది
పెనురక్కసయి మింగుతుంది పరిశ్రమ గొట్టాలను -
నరాలను పేని - ఎముకలను వడికి ఉత్పాదనను డీలా చేస్తుంది.
కొనుగోలు శక్తిని డొల్లలుగా మార్చుతుంది.
నడుములు విరుగగొట్టే ఆర్థిక ఛిన్నాభిన్నం ప్రపంచీకరణ వికృతరూపం
ఈ చీకటి వ్యవస్థను నిర్మూలించాలంటే-
రోజూ వచ్చీపోయే సూర్యులు వందలుగా వచ్చినా సరిపోరు
చీకటిలేని రాజ్యం కార్మిక రాజ్యం
జగతికి అస్తమించని సూర్యుడయి-
నరాలతో - నెత్తురుతో అల్లుకుని
కొత్త కాగితంలో వెదుకుతుంది కోటి గుండెలెక్కడెక్కడని.

రసరాజు

# ఆలోచించు

ఏ చేతులైతే
కులవృత్తిలో కొలువుతీరాయో
ఆ చేతులే మొండిగోడలిప్పుడు-
వాటికి వ్రేళ్లులేవు....
ప్రపంచీకరణ మయసభలో
నేలమీద నెత్తురు చిందకుండా
ఒకోటీ అదృశ్యమైపోవటం
వండర్ కదూ....

పదివ్రేళ్లు పరిశ్రమించినా
ఐదువ్రేళ్లూ నోటివరకూ పోని
అభాగ్య జీవితాలతో
అమావాస్యల్ని ఆడుకోమని పంపించటం
అమృతం తాగేవాళ్ల హక్కేమో...

పొదుగుల్లోకి పాలొచ్చినా
పాలనీ పసితనాన్నీ వేరుచేస్తూ
పాలపై గుత్తాధిపత్యం
వహించినట్లుగా వుంది-
సహజవనరులపై
ప్రజల హక్కుల్ని కోల్పోవటం...

నీ దొడ్లో వేపచెట్టు
నీదికాదు-
ఉగాదిపండుగ చేసికోవాలంటే
వేప్పూవ్వు లేకుండానే
గొంతు
చేదుచేదుగా తడుపుకోవాలి....

చేను నీదే
విత్తనమూ నీదే
అయినా
చల్లటానికి వాడొప్పుకోడు-

వాడు
మంత్రించి ఇచ్చిందే
నువ్వు వాడుకోవాలి-
దానికి మళ్లీ "జన్మ" అంటూ వుంటే ఒట్టు

అది
వాడిలో ఐక్యమైపోతుంది
పాప పుణ్యాల ప్రసక్తి లేకుండా...

"గ్లోబల్ మనిషి" అంటే
ఎవరనుకున్నావ్?
"విశ్వనరుడు" కాదోయ్ పిచ్చివాడా!....
డాలర్ల దుప్పటి కప్పుకొన్నధాకినీ
"డు ఆర్ డై" అని శాసించే శాకిని

సామ్రాజ్యవాద నాటకంలో
సామాన్యునికి
ఒక్క డైలాగూ రాయని
పెట్టుబడిదారీ రచయితే
గ్లో"బలుడు"-

ఇప్పుడు-
వంతెనకి ఆవల ఆ నరకుడూ
ఈ ప్రక్క నువ్వు....
నరకుడొక్కడే బలవంతుడనుకోకు
నీ వెనుక నీ తమ్ముళ్ల సైన్యం అండగావుంది
నిలువెత్తు ఆత్మవిశ్వాసం నిండుగా వుంది
అదీ ఇదీ కలిస్తే
ఆ నరకుణ్ణి
ప్రవాహంలోకి విసిరేయటం
ఏమంతపని!
ఆలోచించు....

రాధేయ

# ఎడారి వసంతం!

ఊళ్ళు బీళ్ళవుతున్నాయి
పల్లెలు తల్లడిల్లిపోతున్నాయి
పట్టణంలోని సంస్కృతి, సభ్యతలు
అశ్లీలం అంచులుదాటి దూసుకుపోతున్నాయి

తల్లిపేగు దుఃఖ భాష అలా తండ్లాడిపోతున్నది
ఈ మౌన విషాదాన్ని అక్షరీకరించడానికెంత
గుండె దిటవుకావాలి?
దేశంలోని జీవనవైరుధ్యం
ప్రమాదస్థాయికి చేరుకుంది!

ఎవరిస్వార్థం వాడిది, ఎవరి ప్రయోజనం వాడిది
ఆధునిక జీవితం విలాసవంతమై
స్థాయీభేదాలతో మనిషి అవసరాలను పెంచింది
మనిషి వ్యక్తిత్వాన్ని మార్కెట్లో రూపొందించి
ఖరీదైన కలలకొనుగోలుశక్తికి
దాసోహంచేసింది.

గ్లోబలైజేషన్ క్రీనీడలు
మన తార్కికజ్ఞానాన్ని గేలిచేస్తున్నాయి
బహుళ జాతుల చేతులమధ్య
మనిషి కంఠం పెనుగులాడుతోంది
ధ్వంసమౌతున్న సమస్త విలువలకూ
ఈ జీవితం ప్రత్యక్ష సాక్ష్యమైంది

ప్రపంచీకరణ నేపథ్యంలో
ప్రవేశించిన వ్యాపారసంస్కృతి
ఈ మనుషులమధ్య ప్రేమరాహిత్యాన్ని
పెంచి పోషిస్తోంది!
వ్యాపారాల్లో ప్రేమలుంటాయా?
అమ్మకాల్లో అభిమానాలుంటాయా?

నేడు మనుషులందరూ వినియోగదారులై!
తమ కలల కరెన్సీ కోసం
ఆత్మల్ని తాకట్టుపెట్టే దినచర్యతో
మొదలౌతుంది జీవితం!

ఇక్కడ 'స్వేచ్ఛ' జీవంలేని బానిసైంది
'ప్రజాస్వామ్యం' వ్యాపార లావాదేవీల్లో
కూరుకుపోయింది
చరిత్రకట్టుకున్న ప్రాచీన పునాదులు
కృంగిపోతున్నాయి
ఉదయరాగాలు, మనోహర సుప్రభాతాలూ
ఇకపై మచ్చుకైనా కన్పించవు
ఎడారి జీవితం తప్ప!

శవాలమీద సవారీ చేసే సామ్రాజ్యవాద పెత్తనం
మన కాళ్ళకింది భూమిని కూడా
తన్నుకుపోతోంది

బహుళజాతి కంపెనీల కనుసన్నల్లో
పంచభూతాలన్నీ శిక్షణ పొందుతున్నాయి
వినోదం విజ్ఞానం పంచాల్సిన ఛానళ్ళన్నీ
మార్కెట్ వస్తువుల విలాసక్రీడల్ని
ప్రచారం చేస్తూ, చాపకింది నీరై
సాంస్కృతిక దాడి సాగిస్తున్నాయి

మనిషికిప్పుడు ఆత్మవిశ్వాసంలేదు
వస్తు వ్యామోహం తప్ప!

దారితప్పితే దిద్దుకోవచ్చు
దారి మార్చిపోతేనే ప్రమాదం!
పరాభవమైనా, పరాజయమైనా
అది మనకు గుణపాఠం
కానీ పలాయనం మన వినాశనమే!
గాలాన్ని ముద్దాడే చేపకేం తెల్సు
తన బతుకే వేలం పాటైపోతుందని
వలలో చిక్కిన పావురానికేం తెల్సు
బోయవారి ఆపేక్ష తన్ను కరకరా నమిలేస్తుందని!!

డా॥ రాపోలు సుదర్శన్

# కలలు కందాంరా!

కలలు కనమని
కలాం చెబుతున్నట్టు
కలలో కలగంటి
కళ్ళు తెరిచేసరికి
నిశ్చల నీటిలో రాయిపడ్డట్టు
కలలో దృశ్యం అదృశ్యమాయే।
ఇలలో దృశ్యం దర్శనమాయే॥

గొర్రెతోక జీతంతో
చావలేక బతకలేక
బతుకుబండి ఈడుస్తున్న తరుణంలో
ప్రైవేటైజేషన్‌తో
ఉన్న ఉద్యోగం ఊడిపోయి
జీవిత నౌక నిరుద్యోగ సంద్రంలో
తుఫాన్ల బాధల్లో చిక్కుకున్న
బతుకులు బాగుపడాలని
కలలు కందాంరా!

సరళీకరణతో
రైతుల ప్రాణాలు పత్తిలా మారినా-
శ్రామికుల ప్రాణాలు
అరిగిన యంత్రాల్లా కరిగిపోతున్నా-
స్వదేశీమంత్రం వల్లిస్తూ
ప్రపంచీకరణతో
విదేశీ సంస్కృతి మత్తెక్కించి

పరాయీకరించినా
సమాజాభివృద్ధికి
కలలు కందాంరా!

పుట్టుకతో వచ్చిన మతబలంతో
పెరిగిన కులం కోరలతో
పెంచిన స్థానిక గోళ్ళతో
రాజకీయ గూండాలు
గూండా రాజకీయాలు
బలహీనుల వెంటాడి వెంటాడి
వేటాడే మానవ మృగాలు
ఓట్లకోసం ఎంతకైనా దిగజారి
గెల్చి ఈనినపులులై
తన వ్యవస్థను తానే భోంచేస్తున్నా-
దేశం బాగుపడాలనే
కలలు కందాంరా!

క్కలై, రాబందులై
ప్రజలను పీక్కుతింటున్న
ప్రపంచీకరణంటే అమెరీకరణే!
ప్రైవేటీకరణంటే నిరుద్యోగీకరణే!!
సరళీకరణంటే చావీకరణే!!!

ఈ పెట్టుబడిదారీ వ్యవస్థ
సముచ్ఛేదానికి,
మరో ప్రపంచ సృష్టికి
ఒంటరి పోరాటాలుమాని
సమిష్టి పిడికళ్ళను బిగించి
పోరాట విజయాల
కలలు కందాంరా!!!

## వర్ఘుల్ల శివకుమార్

# భ్రమావరణాలు

ఒక చేదు అనుభవం లోంచి
తెప్పరిల్లకుండానే
మరో ఉప్పునీటి ఉప్పెన
కళ్ళను కమ్ముతుంది.

నిన్న చెవినిల్లు కట్టుకున్నవాగ్దానం
అందనంత ఎత్తులో
సంస్కరణల ఫలాలనిస్తుంది

నిన్నటి మేనిఫెస్టోలు
నేటి మరణ శాసనాలై
ప్రజాస్వామ్యం వధ్యశిలమీద
బలిహారం కొనసాగుతుంది

ఒక చెరనించి మరొక చెరలోకి
మారుతున్న స్వేచ్ఛని
హంసముఖంతొడుక్కున్న
రాజ్యహింస నిర్వచిస్తుంది

అలజడి కారణాన్ని కాక
అలజడించే ఆరాటాన్ని మట్టుపెట్టడం
లక్ష్యమౌతున్న శాంతిభద్రతల తంత్రంలో
మానవహక్కు ఓ అప్రస్తుతాంశం

పోటెత్తుతున్న డాలర్ దాహాలు
పచ్చటి కలలమీద కత్తి 'గాట్లు'
సరళీకృత సంకెళ్ళ సాక్షిగా
ప్రశ్నార్థకమౌతున్న పునాదుల మనుగడ

ఆకాశంలో గిరికీలు కొడుతున్న ఆరాటాలు
కలల మార్కెట్లో
కనుగుడ్ల వేలంపాటలు

ఉనికిని కోల్పోతున్న నేల
నేలమీద పట్టుతప్పుతున్నకాళ్ళు
మెదళ్ళనిండా అల్లుకుంటున్న
కంప్యూటర్ వైరస్

ఆధారాల్ని కొల్లగొడుతున్న
అభివృద్ధి తంత్రం

భ్రమలు... భ్రమావరణాలు
విచ్చుకుపోతున్న ఆత్మస్థైర్యాలమధ్య
మనిషి ఒక సజీవశవం
ఇక్కడ
ఇంకా భయంలోనో
భ్రమల్లోనో బతకడమే
ఓ దుర్భర దైనిక క్రీడ.

డా|| వి. ఆర్. రాసాని

# ఇంకేముందనీ

కంప్యూటర్ల కబేళాలకు
మన కపాలాలను కైంకర్యం చేసేసింతర్వాత
మన ఆలోచనల్ని ఆవేశాల్ని, ఆదర్శాలను
ప్రైవేటు ఛానల్స్‌కి ధారాదత్తం చేసేసింతర్వాత
ఇంకేముందనీ....

మన మాన ప్రాణ ధనాలను
మన ఆత్మను, ఆత్మాభిమానాన్ని
ప్రపంచ బ్యాంకు కాబూలీవాలాకు తాకట్టు పెట్టేసింతర్వాత

మన బతుకుల్ని అందమైన బాటలుగా
మన వెన్నెముకల్ని పరాయివాడిచేతి వజ్రాయుధాలుగా
మార్చేసిం తర్వాత
ఇంకేముందనీ...

రక్తం పీల్చే జలగలకు
మనల్ని ఆహారంగా మార్చేసింతర్వాత

మన మేధస్సుని,
మన భావితరాలను, భవిష్యత్తును
అమెరికాకు అప్పనంగా అప్పజెప్పేసింతర్వాత
ఇంకేముందనీ...

వడ్డీల కోసం మన నడ్డుల్ని నరికేసి
సంస్కరణల కర్మకాండల్ని కమనీయంగా జరిపించేసింతర్వాత

అంతర్జాతీయ హరిశ్చంద్ర ఘాట్‌లో
మన అభివృద్ధికీ.... స్వేచ్ఛకీ, స్వచ్ఛతకీ
పిండాలు పెట్టేసింతర్వాత
ఇంకేముందనీ....

ప్రార్థనా మందిరాలను కూల్చేసుకునే
కుటిలమత దురహంకారాలే
మరో ప్రపంచ సంగ్రామానికి
సంకలు గుద్దుకుంటుంటే...

ప్రపంచీకరణ విష ఫలాలను ఆనందంగా ఆరగించేసిన
దేశాలనేతల తలరాతల్ని మార్చేదెవరనీ
ఇంకేముందనీ....

## వేల్పుల నారాయణ

# మార్కెట్ మహమ్మారి

నమ్ముకున్నవాడు అమ్ముకుంటున్నాడు
కలాన్ని అమ్ముకుంటున్నాడు గళాన్ని అమ్ముకుంటున్నాడు
కార్యక్రమాల్ని అమ్ముకుంటున్నాడు
పరువును, ప్రజాహితాన్ని జాతిని, జాతీయతను
స్వావలంబనను, సహజీవనాన్ని
అంతర్జాతీయ మార్కెట్ ఇంద్రధనస్సు ఎరలో బడి
అన్నీ పణంగా పెట్టి, అడుగు ముందుకేస్తున్నడు
నిన్నటి వరకు వాడిపై ప్రగతిని పండిస్తాడనే ఆశవుండేది
నిన్నటి వరకు వాడిపై
భవిష్యత్తును బాగు చేస్తాడనే నమ్మకముండేది
కాని వాడు పరాయి వాడికి బహుచౌకగా బేరం కుదిర్చి
రాయితీల రహదారి వేస్తూ
తన స్వార్థం సౌఖ్యంకోసం అందరి నమ్మకాల్ని అమ్ముకుంటూ
పరాయివాడి దీపానికి ఇంధనాన్ని సమకూరుస్తున్నడు.
నమ్మకం విలువను నట్టేటముంచి
అమ్మకం విలువ అంగట్లోకి అంగలేస్తున్నడు
ప్రగతి నాగేటి చాల్లలో నాగజెముడు పొదల అంకురానికి
హేతువై ఎదుగుతున్నడు
పరిశ్రమ పొదుల్నుండి ప్రజాశ్రేయస్సును పారదోలుతున్నడు
చీకటిని సూర్యోదయమని భ్రమింపజేసే
హైవోల్టేజి విద్యుత్కాంతుల్లాంటి తంత్రాలతో
కళ్లను మిరుమిట్లు గొలిపి వాస్తవాలను చూడలేని గుడ్డితనంలోకి నెట్టి

స్వావలంబనను స్వాహా చేసే దుష్ట దుర్నీతి వ్యూహాలతో
మార్కెట్ మహమ్మారి సర్వాంతర్యామిగా
ప్రపంచమంతటా పరిభ్రమిస్తూంది.
సీత శీలాన్ని పరీక్షించినట్లు
ప్రదక్షిణ చేస్తున్న వారిని అగ్ని పునీతం చేసేందుకు
విషం గ్లౌజు తగిలించుకున్న అభయ హస్తాన్నందిస్తుంది.
ప్రపంచ వ్యాపార పరిరక్షణకు గ్లోబలైజేషన్ పేరున
గొంతులు కలుపుకుంటుంది
ప్రపంచ గమనాన్ని నిర్దేశించేందుకు గాట్ పేరున ఉక్కుపాదాన్ని
విశ్వమంతటా విస్తరించుకుంటుంది
ఆలోచనను బలవంతంగా హైజాక్ చేసి
అమ్మకానికి వేలం పాటల్లోకి నెట్టుతూంది
మిత్ర శిబిరాల్లో శత్రు శకలాలను రాజేసి
ఇరు పక్షాలకు ఆయుధాలనందించి
శ్మశానంలో శాంతికి పెద్దరికం వహిస్తుంది.
చివరకుతానే ప్రపంచ కాపలాదారుగా
కర్ర పెత్తనానికి కాలుదువ్వుతుంది.
మార్కెట్ మహమ్మారి మాయలోపడి
అన్నీ పణంగా పెట్టి అధోగతి పాలుజేస్తున్న
వాడ్ని చూస్తూ చలనరహితంగా మౌనంగావున్న నా ప్రజలారా!
మహాప్రమాదం ముంచుకొస్తూంది.
గొంతులు విప్పి ప్రతిధ్వనించండి
సంఘటితమై ప్రతిఘటించేందుకు సంఘశక్తిగా ఆయుధంగా పదునెక్కండి

శేషం సుప్రసన్నాచార్యులు

# అనాథ

నేను కొడుకున్న అనాథని కాదు...
ఆ కొడుకు కోరుకున్న అనాథని
కని, పెంచిన కొడుక్కి పట్టని అనాథని
కోడలుచే పనిమనిషిగా గుర్తింపబడి
చేయని నేరాలకు గెంటివేయబడ్డ అనాథని
తొమ్మిది నెలలూ మోసిన నా గర్భానికి
ఆరని శోకాన్ని మిగిల్చిన కొడుకున్న అనాథని
గ్లోబలైజేషన్ గ్లోబులో రోబోటులా తిరుగుతూ
డాలర్ల స్విమ్మింగ్ పూల్లో
ఊపిరాడకుండా ఈదుతూ
కంప్యూటర్ బొమ్మలతో పల్టీలు కొడుతూ
ఇంకా చావని కొడుకున్న అనాథని
మ్యారేజి బ్యూరో లాటరీలో పెళ్ళాన్ని ఏరుకుని
సూపర్ మ్యాన్‌లా ఎగిరి సప్తసముద్రాలు
దాటిపోయిన "అనాథ" తల్లిని
కొడుక్కు పట్టని అనాథని
"అమ్మా!" అని పిలిపించుకోలేని అభాగ్యురాలిని
అగ్రదేశంలో డాలర్లు పండిస్తూ
అంత్య ఘడియలకోసం అగ్రులు చాస్తూ...
ఎప్పుడు చస్తాడో? తనకే తెలియని
కొడుకున్న అనాథని
నేను అనాథనైనా నా దేశంలో తృప్తిగా బతుకుతున్నాను.
అనాథనైనా ఆత్మాభిమానంతో చరిస్తున్నాను.

## శ్రీదాస్యం లక్ష్మయ్య

# తస్మాత్ జాగ్రత్త....

నువు తుఫానులా వచ్చి భీభత్సం సృష్టిస్తావు
టపాసులా పేలి దీపాలను ఆర్పుతావు
ప్రాణాలను నిలువునా హరించడం తప్ప
స్వేచ్ఛగా ప్రాణవాయువు పీల్చే దెస నెక్కడ ఏద్వనిచ్చావు
అవసరం లేకపోయినా - ఆడగకపోయినా
అన్నింటా తలదూర్చి అంగుళం అంగుళం సగబెడతావు
డేగ కళ్ళతో గాలిస్తూ....
సామ్రాజ్యవాద పోకడలను నిరసించే
వాసనలను పసిగడతావు
ఎడారిలో తోడుకునే తైలం మీద కళ్ళు పెడతావు
ఎక్కడో ద్వీపంలో ఏం జరిగినా నీలో అలజడే
యిజాల మధ్య, నిజాల మధ్య చిచ్చె రగిలేది నువ్వే
కునుకు సైతం ఆనక
సరిహద్దు రేఖల్లో పహారా కాసే చూపుకు
ఆజ్ఞాపింపజేసే నీ మదపు కళ్ళకు
సామ్రాజ్యాలే దాసోహం అంటున్న తీరుకు
నీకు నువ్వే జబ్బలు చరుచుకుంటావు
మరిగిన జలగలా ప్రపంచాన్ని చుట్టాలని
నీ ఆరాటపు చేష్టలతో
పచ్చటి జీవితాలలో చిచ్చు రగిల్చే చూపులు
నీ ఆస్తుల గర్వపు అంతస్థుల మిద్దెల్ని గద్దపోల్లు కూల్చినా
పొగరణగని పోట్లగిత్తవు

స్వాతంత్ర్యపు గాలులు పీలుస్తూ
ప్రజాస్వామ్య పునాదులతో ఎదిగిన భారత దీన నగాన్ని
డీ కొట్టాలని చూస్తున్నావు
కొమ్ముతిరిగి తలపగిలి చస్తావు
తస్మాత్ జాగ్రత్త...

షేక్ కరీముల్లా

# నిరసన జెండా

పచ్చని చద్దర్ కప్పుకున్న
వసంత కన్యలా మురిపించే పొలాలు
ఒట్టిపోయి పాదుగెండిన స్థన్యాల్లా తేలాయి
పరిశుద్ధ స్వేదంతో పరిమళించే కార్ఖానాలు
కొల్లగొట్టబడ్డ ఖజానాల్లా మిగిలాయి
ఆదేశ సూత్రాలు ఆనవాళ్ళు వెతుక్కుంటున్నాయి
ఆలిని, ఆకలిని కడతేర్చి
అన్నదాత అదృశ్యమౌతున్నాడు
ప్రపంచీకరణ నేపథ్యం....
అలీనానికి, విలీనావికి
శఠగోపం పెట్టింది.
భూమి చిన్నదైంది కాని
మనుషుల మధ్య, మనసుల మధ్య
కోటానుకోట్ల కాంతి సంవత్సరాల
అగాధం ప్రత్యక్షమైంది
శరీరం మనదే
ప్రవహించే రక్తం పరాయిదైంది.
వలసవాదం గతిమార్చి
నయా రూపు ధరించి
ముగ్ధ మోహినై మురిపిస్తుంది
అదృశ్య హస్తమేదో నన్ను
పరాధీనుడ్ని చేస్తుంది

ప్రపంచ బ్యాంకు పంచకాన్ని
పంచామృతంలా సేవించమంటున్న దళారీతనం.
మిట్ట మధ్యాహ్నం కొల్లగొడ్తున్న దోపిడీదారుని
కల్పవృక్షమని నమ్మమంటున్న బికారీతనం
గరీబు దేశాల్ని కబాబ్ ముక్కల్లా
చప్పరిస్తున్న తెల్లోడి తెంపరితనం
ఊహూ... ఇక లాభం లేదు
మన ఇల్లు మనకు మూగభాష నేర్పకమునుపే
మన ఊరు మనది కాకుండా పోకమునుపే
మనదైన జీవితం కోసం
ఒక నీరవ నిశ్శబ్దం లోంచి
పోలికేకకై గొంతులు సవరించుకుందాం
మసిబొగ్గయిన బ్రతుకుల్లో
ఓ నిప్పుకణిక వెలిగించి ఊపిర్లొదాం
నిరసన జెండాలై ప్రతిధ్వనిద్దాం

# సలీం

# నాటకం

వాడు నటిస్తున్నాడని నాకు తెలుస్తూనే ఉంది
నేనూ నటిస్తున్నాను వాడికీ తెలుసనే అన్పిస్తోంది
యిద్దరం నటనలో జీవిస్తున్నాం
నవ్వు తెరచాటున నొసలు గుసగుసలు....
యిక్కడ కన్పించేవి కేవలం కరచలనాలే-
రెండు కరవాలాలు
ఖణేల్‌మంటూ కల్సుకున్నట్లు...
అవసరమైన హృదయస్పర్శలుండవు
అంతా కృత్రిమత్వం
పెంటియం మెదళ్ళతో పరిశీలిస్తుంటారు
హార్డ్ డిస్కుల మయం
హృదయాలుండవు
సున్నితత్వపు అవశేషాల కోసం
ఏ మ్యూజియంలో వెతుక్కోవాలో?
'హాయ్' అంటూ పల్కరింపు...
ఖండాంతరాల నుంచి ధ్వని తరంగాల ప్రయాణంలా..
దూరంగా... సుదూరంగా...
మనసులు సుమహారంలోని
మల్లెపువ్వుల్లా పెనవేసుకుని పరిమళించవు
మనుషులు స్వజాతి ధృవాలు కదా
వికర్షించుకుంటూనే ఉంటారు.

## సుదేరా

# స్వేదవిస్ఫోటనం

తోటంతా ఎన్ని రంగుపూలు రాలితే ఓ సీతాకోకచిలుకకి
రెక్కలవుతాయో
రేబాన్ కళ్ళద్దాల మబ్బులకి పూసిన ఇంద్రధనస్సుల్తో రమించేవాడికి
తెలీదు.
ఫౌళ్ళంతా ఎన్ని కాయలుకాస్తే ఓ రైతు తీయటి కాయవుతాడో
డీప్‌ఫ్రీజర్లోని ఫ్రూట్‌జ్యూసులో స్ట్రాయై గుటకలేసే గులాబినాజూకు
పెదాలకు తెలీదు.
నైపుణ్యానికి ఎన్ని నెత్తుటి కెంపులుపూస్తే ఓ నరం కరంటుపారే
తీగవుతుందో
కనుగుడ్లపై కేబుల్టీవీ ఎపిసోడ్లని ధరిస్తూ ఇంటర్నెట్ సైట్లలో క్రికెట్
ఆడుకొనేవాడికి తెలీదు.
మేడే అంటే ఎన్ని చెమట ఇటుకలతో కట్టిన అంతస్తుల మేడో
కంప్యూటర్లు విసర్జించే డాలర్ల కంపుని మరిగిన ఏసీ సుఖాలకి తెలీదు
మేధోసంపత్తికి సైతం మల్టీనేషనల్ పేటెంటు తీసుకొన్నవాడు
మన దేశవాళి మెదళ్ళపై మేడినమెరికా ముద్రెందుకు కొడుతున్నాడో
వీసాలపై దాస్యాన్ని మోస్తున్న హైటెక్ కూలీలకు తెలీదు
ఆయిలు మరకల ఖాకీచొక్కాలపై తెల్లటి చారికలై ఘనీభవించిన స్వేదమే
స్టాక్‌మార్కెట్లో పందెపుగుర్రాలై పరుగులెత్తే సంచలన సూచికలవుతుంది
మడిలో వంగిన నడుముముడతల్లోంచీ బొట్టుబొట్టుగా రాలే ఉప్పటి
చుక్కలే
రుణఖాతాలో రోజురోజుకీ తృణసమానమై కృశిస్తోన్న రూపాయి
మోచిప్పలపై దేకుతున్న అనాదాయ అర్థికవనరులకి ఆయుర్దాయం
పోస్తాయి.

గోచిపీలికే అచ్ఛాదనైన మురికివాడల పిరుదులకిందనుంచీ పారే
దుర్గంధమే
దారిద్ర్యరేఖా శిఖరమ్మీద శీర్షాసనం వేసిన ప్రగతి మెడకు ఉరిముడై
బిగుస్తోన్న
ద్రవ్యోల్బణపాశాన్ని పుటుక్కున తెంపెయ్యగల అపద్బాణమవుతుంది.

❀ ❀ ❀

'జాతీయాకరణ' గోతితో పాతరేసిన స్వతంత్రభారతి సమాధిపలకం
నున్నుదుట చెరిగిపోయిన తిలకపు నినాదమయ్యిందని
నున్నగా గుండుగీసిన స్వదేశీ జాగరణానికి నామాలతికించి నక్షత్రాల
టోపీ తొడుగుతున్నారు.
సంతకంచేసే చేయిమారినప్పుడల్లా రంగుమారుతున్న రాజ్యాంగమిప్పుడు
తెల్లవాడికి హక్కు భుక్తమై రాసిచ్చిన ఫర్మానా!
పీనుగుల్ని పిప్పరమెంటుల్లా చప్పరిస్తున్న పార్లమెంటు
వాడు రిమోటుతో ఆడించే పెంపుడు స్కామిస్టుల తాలింఖానా!
చైనా వాషింగ్టన్ల ముష్టిమైదునానికి అలీన హంసతూలికా తల్పమైన ఈ
ద్వీపకల్పమిప్పుడు
వాడి బూటుకాళ్ళ కిందకు పరచిన కార్పొరేట్ కార్పెట్!
అరచేతెడు తెరమీద ప్రపంచాన్నో బంతిని చేసిన
వొరాకిల్, మైక్రోసాఫ్టులు ఉజ్జీలై ఆడుకొందుకు గుత్తకిచ్చిన టెన్నిస్‌కోర్ట్!
బౌలింగ్ ఎలీలు, పూల్‌పార్లర్లు, ఫ్యాషన్‌షోలు, క్రికెట్ బెట్టింగులు
నవమిలీనియం వక్షోజాలపై గురిపెట్టిన సంకర పారిశ్రామిక
సమీకరణాలవుతున్నప్పుడు.
నోటికి రోటీకంటే నేత్రసమ్మోహిత ఐ.టీ, బ్యూటీలే నిత్యావసరాలని
శాసన సహితమై నిర్వచిస్తూ
లేప్‌టాప్ స్క్రీనులపై లేమినిర్మూలనా స్కీములు పన్నుతున్నప్పుడు,
స్వర్ణత్రికోణాలు, సిలికాన్ వనాలు పిసరెత్తు కసరెత్తు లెరగని
కాస్మోపాలిటన్ గజ్జల్లో చీముగడ్డలై వాస్తున్నప్పుడు,

దేహబలాలు, లోహబలాలు చాలవు సైబరు శకపు ధనదాహాలు
తీర్చడానికి!
ఘర్మజలాలు సరిపోవు కరెన్సీ కర్మాగారాల ఇంధన రంధిని
చల్లార్చడానికి!
ఇరుసుకి, ఇనుపచక్రానికి మధ్యన కందెనై నలిగిన కర్మజీవి
ఇప్పుడు డిజిన్వెస్టిమెంట్ల సాక్షిగా కాందిశీకుడు!
వరల్డుబ్యాంకు అప్పుల పద్దుల్లో జమైన శ్రమైకసాధకుడిప్పుడు
స్వాధీన సరిహద్దు శిబిరంలో నిస్సహాయ నిర్వాసితుడు!
ఇప్పుడు - ప్రతికార్ఖానా ఓ కల్పిత కార్గిల్ మైదానమే!
ప్రతి కార్మికుడూ ఎక్కుపెట్టిన సైనిక విన్యాసమే!
ప్రతి కమతమూ ఓ అప్రకటిత శత్రువ్యూహమే!
ప్రతి కర్షకుడూ బిగుస్తోన్న ఉరిముడిలోంచీ ఘర్షిస్తోన్న ఉరుమే!
కారే ప్రతిస్వేదబిందువూ విస్ఫోటించే ఆయుధమే!!

సోమేపల్లి వెంకటసుబ్బయ్య

# సైబర్ మేఘాలు

ఒక గ్లోబల్ ప్రశ్నార్థకం
ఏ వైపుకు వెళ్ళాలో అర్థం కాని అయోమయ స్థితి....
గ్లోబల్ మేఘాలు చిమ్మచీకట్లుగా కమ్ముకొస్తుంటే
కల్లతనాన్ని డొల్లతనంతో కప్పుకునే విత్తనమూ
మానవ అనుబంధాలకు బొర్రెపెడుతున్న
డాలర్ ఎరా
సాంస్కృతిక జీవన సౌందర్యాన్ని కబళిస్తున్న
కొండచిలువ ఛానళ్ళూ
ఆడతనాన్ని అందాలుగా ఆరబోసే
వాణిజ్య సామ్రాజ్య సంస్కృతీ
చెరుపు చీకట్లో చిక్కుకున్న చేతివృత్తులూ
రాత్రికి రాత్రే కోటీశ్వరుడు కావాలంటే....
ఆశలు రేకెత్తించే 'బనేగా' ప్రోగ్రాంలూ
శరీరపు కొలతలకి పెద్ద పీటవేసే
అంగాంగపు అందాల పోటీలూ
తినే తిండికీ తాగే నీటికేగాదు
పీల్చే గాలికీ
ఇక బ్రాండ్ నేమ్‌లు వస్తాయేమో...!
అరచేతిలో ఇమిడిపోయే ప్రపంచం
అయిదు వేళ్ళనీ నోటిదాకా తీసుకెళ్తే
అంతేచాలు....

గద్దర్

# అమెరికోడొస్తుండో!

అడుగడుగో అడుగోసూడూ అమెరికో డొస్తుండూ
జపాన్ జర్మని తోడు అమెరికో డొస్తుండూ
బాంబుల సంచులతోని బందూకులు లోడుచేసి
తల్లీ భారతి ఎదలమీదా పాదాలు మోపిండుసూడూ ॥అడుగ॥
గాడ్‌రేజు కంపినోడు - గుడ్ మార్నింగ్ సారూ అండూ
హిందూస్తాన్ లివారోడు - వందేమాతర మండూ
కాల్గెట్ కంపినోడూ - కాలరెత్తిండు సూడూ
పార్లే కంపినోడూ - ‘పరదక్షణ చేస్తుండూ
టాటా, బిర్లాగాడూ - తాళాలు గొట్టుతుండో
ప్రధానమంత్రిగాడు పాదాలు బిస్కుతుండూ
ముఖ్యమంతిగాడు మూతినాకుతూండూ ॥అడుగ॥
రెక్సోన సబ్బు అయ్యి - మూతికి రుద్దు తుండూ
కాల్గేట్ బ్రష్ అయ్యి - నోట్లోన దుంకుతుండూ
గెలిటీన్ బ్లేడు అయ్యి - గడ్డాలు గీకుతుండూ
కలరూ టి.వి అయ్యి వాడు - కన్నూగోడుతుండుసూడు ॥అడుగ॥
మన మంచి నీళ్ళల్లో - పంచదార వేసి
కోకో, విషము గల్పి - కోకాకోలచేసి
రమ్ము రంగుచూసి - దమ్ము కొట్టు మండూ
మన కొబ్బరి నీళ్ళు - గబ్బు నీళ్ళు అండూ
కోకకోలకు కొబ్బరి బోండకు కొట్లాట బెట్టిండు సూడు ॥అడుగ॥
బాల సెంద్రునిలాంటి - కాలేజీ కుర్రోల్ల
బతుకుల్లో బ్రౌన్ శుగరై - నరాల్లో మత్తు మందై

చిగురించే కొమ్మలాను చిదిమేసి పోతుండు సూదు ॥అదుగ॥
స్టార్ హోటల్లోవాడు - సినుకు లై కుర్సుతుండూ
సచ్చె ముసలోనికి గూడా - చక్కలిగిలి చేస్తుండూ
బ్రేకు డ్యాన్స్ అయ్యివాడు బ్రేకు చేస్తుండు సూడూ ॥అదుగ॥
ఐ. ఎం.' ఎఫ్ వరల్డ్ బ్యాంక్ - అమెరికా జేబు సంస్థ
అప్పిచ్చినట్లె ఇచ్చి - ఆడిస్తడు అటుసూడూ
వడ్డి కిందికి ముదరబెట్టి - ముడ్డి కింద మంటబెడ్తడు
మోకచూసి భారతమాతను - మొండెం దాక మింగుతాడు
తల్లీ, భారతి తాళీ బొట్టుకు గాలం వేసికూసుండూ ॥అదుగ॥
అమెరికోని కాల్గేట్ కంపిని - వొరిసేలకు వొలవేసింది
పచ్చని సేలమీదా - పడగవిప్పింది సూడూ
ఇత్తూకు ముత్తుమాని - ఇత్తనా లిస్తవుండూ
అమెరికా మందుసల్లకుంటే - మొలకా కొలకెయ్యదండూ
హైబ్రీడ్ విత్తనాలు అలకి వోస్తే మొలక రాలే ॥అదుగ॥
అప్పులిచ్చి అమెరికోడు - చెప్పరాని శరతులుబెట్టె
ఎరువులమీద, బియ్యం మీద - సబ్సిడి, గిబ్సిడి స్టాప్ అండూ
వంటనూనె, గోధుమ పంటకు - మద్దతు ధరలు మటాష్ అండూ
స్మాల్ స్కేల్ ఇండస్ట్రీల గేటుకు తాళం బెట్టాలండూ ॥అదుగ॥
కరెంటు బల్బు అయ్యి - నెత్తిమీదెలుగు తుండూ
సెల్వానియా ట్యూబులైటయ్ - రుబాబు సేత్తుండు సూడూ
సీమెన్సు బల్బు అయ్యి - సీజన్ నాదేనండూ
క్రాంప్టన్ బల్బు అయ్యి - కరెంటు షాకిస్తుండూ
హెచ్. యం. టి., బజాజ్, కైతన్ - ఏట్లె పడేయ్ మండూ
మార్కేట్లో కనబడితే - మక్కెలిరుగుతాయండూ
మనగుడ్డి దీపాలను ముడ్డికి తుడ్సి పారేసిండూ ॥అదుగ॥
మనసేతుల పెన్ను అయ్యి - రాతలు రాస్తుండు సూడూ
పార్కర్ పెన్ను అయ్యి - మార్కు లేస్తుండు సూడూ
విల్సిన్, కేమ్లిన్ పెన్ అయ్యి - ఎక్కిరిస్తుండు సూడు

పాయిలేట్ పెన్ను అయ్యి పాకెట్లో దాగుండూ సూడు ||అడుగ||
బిస్కెట్లు, చాకిలేట్లు - ఊరీల్లు ఊరుతుండూ
క్యాడ్‌బరి చాకీలేటయ్ - కొండనాలుక నాకుతుండూ
హార్లిక్స్, బోర్నివీటై - ఆవుపాలు నీల్లు అండూ
బోర్నివీట నాకకుంటె - బొండెలెక్క ఉబ్బవండూ
అమెరికోని బిస్కెట్ తింటే ఆకలిగాదు దొడ్డికి రాదూ ||అడుగ||
గడియారమయ్యివాడు - గడిబిడి చేస్తుండుసూడూ
ఓమెగా, సిటిజన్ వాచై - సీటి గొడుతుండు సూడూ
ఫెవర్‌టూబా టైటాన్ వాచై - టికి, టిక్ అంటుండుసూడూ
రికో వాచ్ అయ్యివాడు కీకీ అంటుండుసూడూ ||అడుగ||
సిగరెట్లు అయ్యి వొచ్చి - సిగముడీ బట్టు కుండూ
క్లాసిక్, క్యాప్టెన్ అయ్యి - హైక్లాసును నేనేఅండూ
సీజర్సు విల్స్ సిగరేటయ్యి - పల్సు పట్టుకుండూ
బ్రిస్టల్, గోల్డ్ ప్లేకై - బెట్టూ, కట్టూతుండూ
హడెయ్ చెత్తలండూ - పనామా, చార్మినార్
మన ఊపిరితిత్తులాను - వొల్సుక తింటుండుసూడూ
నోట్లే నుండి వోయి ముక్కులనుండి వెల్లుతుండు ||అడుగ||
పంటలకూ నెలయ్యి - వంటింట్ల కొచ్చిండూ
నువ్వుల నూనే సెనగనూనే - సేదు సేదు అండూ
వంటలకు పనికిరాదు - వొంటికి మంచిది కాదు అండూ
ఫ్లోరో, క్రిష్టల్ నూనే అయ్యి - వోజు గొడుతుండు సూడూ
సన్‌డ్రాప్, డాల్డ అయ్యి - ఓన్లీ వన్ డ్రాప్ అండూ
వొయ్యింట్ల కొచ్చివాడు సుయ్యి, సుయ్యి అంటున్నాడూ ||అడుగ||

## గోరటి ఎంకన్న

# పల్లె కన్నీరు

భూమాత ఏడ్చింది నా బిడ్డ రైతన్న
ఏనాడు స్థిమితంగా తిండి తినడటంచూ
చేతి వృత్తులవారి చేతు లిరిగి పాయే
యక్షగానాలు అడుగంటి పాయే
పల్లె కన్నీరోద్చే -. పని పాటలవాండ్ల
ఉనికి కనపడదు - నా ఊరిలోనా.....ఆ....ఆ....
పల్లే కన్నీరు బెడుతుందో - కనిపించని కుట్రల
తల్లీ బంధీయ్యై పోతుందో కనిపించని కుట్రల ॥పల్లె॥
కుమ్మరి వాములో తుమ్మలు మొలిచెను
కమ్మరి కొలిమిలో దుమ్ము లేచెను
సాలెల మగ్గము సదుగు లిరిగినయి
పెద్ద బాడిషా మొద్దుబారినది
చేతివృత్తులవారి చేతు లిరిగినాయి - నా పల్లెలోనా
గ్రామస్వరాజ్యం గంగలోనా మునిగే - నా పల్లెలోనా ॥పల్లె॥
మడుగులన్ని అడుగంటి పోయినయ్
బావులు సావుకు దగ్గరైనవి
వాగులు వంకలు ఎండిపోయినయ్
సాకలి పొయ్యిలు కూలిపోయినవి
పెద్ద బోరు పొద్దంతా నడుస్తుందో బలిసిన దొరలది
బక్కరైతుల బావులెండిపాయే - నా పల్లెలోనా ॥పల్లె॥
ఈదులన్నీ వాడి మొద్దులైనవి
ఈత కల్లు బంగారమైనదీ

మందు కలిపిన కల్లు త్రాగిన
మంది కండ్లలో ఊసులైనవి
సల్లని బీరు విస్కీ ఎందుకొచ్చే - నా పల్లెలోనా
కూలి కంచములో రాల్లు ఎవడుగొట్టే - నా పల్లెలోనా ॥పల్లె॥
ఎరుక బాపలకు గాలాలేసే
తురకల పోరలు ఏడికిపోయిరి
లారీలలో క్లీనర్లైనరా - పెట్రోల్ మురికిలో - మురికయ్యింద్రా
దూద్ సేమియాకు దూరమైయ్యినారా - గా సాయెబ్ పోరలు
బేకరి కేక్‌తో ఆకలి తీరిందో - ఆ పట్టణాలలో ॥పల్లె॥
అరకల పనికి ఆకలి తీరక - గడెం, నాగలిపని - గాసమెల్లక
ఫర్నీచర్ పనులెతుక్కుంటూ - ఆ పట్నంబోయిరి విశ్వకర్మలు -
అసాములంతా కుసోనుండేటి - వడ్రంగి వాకిలి
పొక్కిలిలేసి - దుఃఖిస్తున్నాదీ - మన పల్లెలోనా ॥పల్లె॥
నారికెంపులా తెల్లజెల్లలు - పరులకు తెలియని మరుగు భాషలో
బేరంజేసే కంసలివీధులు - వన్నెతగ్గినవి చిన్నబోయినవి.
చెన్నైబాంబే కంపెని నగలొచ్చే - నా స్వర్ణకారుల
చంద్రకోలలతో తరుముతున్నరన్నో - మన పల్లెలనుండి ॥పల్లె॥
మేరోళ్ళ, చేతులకత్తెర - మూలనబడి చిలుమెక్కిపోయినది
కుట్టుదు రెట్టల బనీన్లు పోయినవి - సోడెలాగులు జాడకే లేవు
రెడీమెంట్ దుస్తుల ఫ్యాషనొచ్చినాదా - మన పల్లెలోకి
మన కూలికంచములో రాళ్ళు గొట్టిరయ్యో - మా పల్లెలోనా
॥పల్లె॥
మాదిగలంద నోరు తెరిచినది - తంగెడు చెక్క బెంగపడినది
తొండము బొక్కెన నిండమున్గినది - ఆరే రంప పదునారిపోయినది
పాతరేకువలె మోతలు మోగేటి - ఆ ప్లాష్టిక్ దప్పులు
తోలు దప్పులను పాతరేసెరన్నో - నా పల్లెలోనా ॥పల్లె॥
యిల్లు కట్టుకునే యిటుకకో రాయికో - సెలుకల జల్లే ఎరువు కుళ్ళుకో
ఎద్దుబండివున్నోడికి చేతుల - ఏడాదంతా పనిదొరికేది.

టాటా, ట్రాక్టరు టక్కరిచ్చేరన్నో - మన పల్లెలోనా
ఎడ్లబండి గిల్లెగిరి పడ్డదన్నో - మా పల్లెలోనా ॥పల్లె॥
తొలకరికురిసితే పులకరించే ఆ నేల పరిమిళం - ఏడికిబోయే
వానపాములు నత్తగుల్లలు - భూమిలో ఎందుకు బ్రతుకుటలేవూ
పత్తి మందుల గత్తర వాసనతో - నా పల్లెలోనా
మిత్తికి దెచ్చిన అప్పే కట్టాయే - నా పల్లెలోనా ॥పల్లె॥
హరిచంద్ర భజన్నాటక పంతులు - హార్మోనియం చెదలు పట్టినది
యక్షగానము నేర్పే పంతులు - ఉప్పరి పనిలో తట్టపట్టినదు
యాచకులూ, నాబుడిగ జంగాలూ - ఆ పల్లెలు విడిసి
పాత బట్టలు గల్లిలమ్మూతుంద్రూ - ఆ పట్టణాలలో ॥పల్లె॥
వందల దట్టీలు కట్టే పీర్లకు - ఒకటి రెండు మూటలు బోయీ
అలావు నిప్పులు ఆరిపోయినవి - పలావు కందూలు పాతర బడ్డవి
యింటికొక్క అయ్యప్ప వెలిసినాడో - నా పల్లెలోనా
యింటి దేవరలు యిగుల పట్టినాయే - నాపల్లెలోనా ॥పల్లె॥
పిండో లెన్నెలరాలుచుండగ - రచ్చబండపై కుసోని రైతులు
ఎనకటి సుద్దులు ఎతల కథలను - యాదిజేసుకొని బాధలు మరిసెరు
చుక్కనోటిలో పడ్డాదంటేనే - నా పల్లెలోనా
ఒక్కడు రాతిరి బయటకు రాడమ్మో - మా పల్లెలోనా ॥పల్లె॥
కోలాటం బతుకమ్మ పాటలు
భజన కీర్తనలు మద్దెల మోతలు
బైరాగుల కిన్నెర తత్వమ్ములు
కనుమరుగాయెర మన పల్లెల్లో
స్టార్ టివి సకిలిస్తు ఉన్నదమ్మో మన పల్లెలోన
సామ్రాజ్యవాద మిషమెక్కుతున్నదమ్మో
మెల్లంగ పల్లెకూ ॥పల్లె॥

## డా॥ ఎస్వీ సత్యనారాయణ

# హైటెక్ గీతం

అమ్మలార! రండి - ఆ అమెరికోడు వొస్తడంట
హారతి బట్టండి - బుష్ దొరగాడొస్తున్నడంట
బాబు జెప్పుతుండు - గొప్పూరిబాబు వొస్తడంట
చిప్పలు బట్టండి - అప్పిచ్చెటోడు వొస్తడంట ॥అమ్మలారా! రండి॥

అణుబాంబులు కలిగి ఉన్న - అగ్రదేశమధ్యక్షుడు
హిరోషిమా నాగసాకి - నెడారులుగ మార్చినోడు
పొరుగునున్న శత్రుదేశ - మిత్రుడిగా మెలిగెటోడు
హిందు మహాసముద్రాన్ని - సైన్యంతో నింపెటోడు
దేశాలను సుట్టుకుంటు - మన దేశం వొస్తడంట॥అమ్మలారా!రండి॥

దేశాలకు నడుమ - వి-ద్వేషాలను పెంచెటోడు
జాతుల కలహాలు - రాజ-నీతిగ ప్రకటించెటోడు
యుద్ధాలను రేపి - విశ్వ-శాంతిని ప్రవచించెటోడు
ప్రపంచాన్ని తన మార్కెట్-కొట్టుగ కొట్టేసినోడు
తెలివెంతో మీరినోడు - తెలుగు దేశమొస్తడంట ॥అమ్మలార! రండి॥

వేపపుల్ల పళ్లకిపుడు - కాల్గెట్ నందించినోడు
నలుగు పిండి - పసుపు బదులు - లక్సురిన్నులిచ్చినోడు
కొబ్బరి బోండాలు మాన్పి - కోకాకోల దాపినోడు
ఈత తాటి కాల్లులాపి - స్కాచ్ విస్కీ బోసినోడు
మన చెరువున నీళ్ళుబట్టి - మనకే అమ్మేసెటోడు ॥అమ్మలార! రండి॥

మన దేశం మన సంస్కృతి - మనుగడ నణిచేసినోడు
మన భాషలు మన యాసలు - మంట్లో గలిపేసి నోడు

టీవీ చానల్లు దెరిసి - తెలివిగ మింగేసినోడు
క్రూర నేర విష సంస్కృతి - మనపై రుద్దేసినోడు
ఐఎంఎఫ్ షరతులతో - నిండా ముంచేసెటోడు ॥అమ్మలార! రండి॥

తాగునీరు సాగునీరు - సమస్యల్ని తలవకండి
వ్యవసాయం - విద్యుత్తు - విద్య - వైద్య మడగకండి
సర్కారీ ఉద్యోగం - సంగతింక మరిచిపొండి
ప్రాజెక్టులు ఫ్యాక్టరీలు - పాతపాట పాడకండి
కంప్యూటర్ బొమ్మజూసి - కడుపులన్ని నింపుకోండి ॥అమ్మలార! రండి॥

ప్రభుత్వ కార్యాలయాలు - ప్రయివేటోళ్ళ కిచ్చేద్దాం
సిరులొలికే సంస్థలన్ని - సింగపూరు కమ్మేద్దాం
సర్కారీ బడులు మూసి - దూరవిద్య తెరిచేద్దాం
సామాజిక న్యాయానికి - చెల్లుచీటి రాసేద్దాం
హైటెక్ పరిపాలనతో - అమెరికాను మెప్పిద్దాం ॥అమ్మలార! రండి॥

నందిని సిధారెడ్డి

# పూల పూల తోట లోపల

పూల పూల తోట లోపల
పురుగు ముట్టిందో ॥సెల్లేలా సఖూలారా॥

సేను సెలక సొగసులల్ల
సెడుగు మొలిసిందో ॥సెల్లేలా సఖూలార॥

గొలుసులేసిన వరిసేనుకు
గొంతెమ్మ కోరికలాయె
విరగగాసిన పత్తిసేనుకు
తరగనన్నీ అప్పులాయె
పైస పైస మిత్తితోటి
పానమిడిసేనా ॥సెల్లేలా సఖూలారా॥

తీరు తీరుబాధలతో దిగులుబుట్టేనా ॥సెల్లేలా సఖూలారా॥

తాత తండ్రుల వారసత్వం
తరలిపోయే యెవుసమాయె
ఏల్ల తరబడి దాసుకున్న
ఇత్తనాలకు వొట్టమొచ్చె
ఇత్తనాలకు హక్కులంటూ
ఎంట బడ్డాదా ॥సెల్లేలా సఖూలారా॥

ఆకులలములు పేడగొట్టి
ఎరువువేసి బలము జేస్తిమి
మందికొంపలు ముంచడానికి
మందు ఎరువులు బెట్టినాడు

తిండి గింజల సారమంతా
తీరిపోయేనా ॥సెల్లేలా సఖూలారా॥

కొత్తరోగం కడుపులోపల
కోతపెట్టేనా ॥సెల్లేలా సఖూలారా॥

ఇంగిలీసు మందులొచ్చీ
మనిషి బలమూ మందువాయె
మందులూ తయారుజేసె
మాయ పెత్తన మడుగుతుండ్రు
రోగినోట్లో మట్టిగొట్టి
బోగమాడేనా ॥సెల్లేలా సఖూలారా॥

ధరలు పెంచి పెద్దదొరలు
దండుకుంటారా ॥సెల్లేలా సఖూలారా॥

పచ్చపచ్చటి నేలతల్లి
పగులుబారి పలుకరించె
గోరువంక పాలపిట్టగోదుగోదున పలవరించె
ఆవుమేతను దోసుకోని ఆవులించేనా ॥సెల్లేలా సఖూలారా॥

జీవరాశి హక్కురాసి జీవిదీసేనా ॥సెల్లేలా సఖూలారా॥

అందమైన వనం చుట్టూ
ముళ్ళకంచె అల్లుతుండు
పానమోలే పెంచుకున్న
పాలపొదుగును ఖైదుజేస్తడు
వాని పెత్తనమెందుకాని వంగబెట్టాలె
జట్టుగట్టి దంకెలోనితో
జంగు జెయ్యాలె ॥సెల్లేలా సఖూలారా॥

లొల్లిపెట్టి జంగుజేసి
ఎల్లగొట్టాలె. ॥సెల్లేలా సఖూలారా॥

భూపాల్

# జిమ్మేదారి కోయిలా!

ఎట్లా వుందాములో జిమ్మేదారికోయిలా
చెట్లా చెంచారమామె జిమ్మేదారికోయిలా
అడుగుదీసి అడుగేస్తే జిమ్మేదారికోయిలా
అమెరికోని జాడలాయె జిమ్మేదారికోయిలా
అంగట్లో బతుకాయే జిమ్మేదారికోయిలా
గొంగట్లో మెతుకాయె జిమ్మేదారికోయిలా

కోకిలమ్మ పాటవాయె జిమ్మేదారికోయిలా
లేగదూడ ఆటవాయే జిమ్మేదారికోయిలా
కలువు మడీ గుడిసెకేమొ జిమ్మేదారికోయిలా
కేబుల్ టీవీలు వొచ్చె జిమ్మేదారికోయిలా

సోరవయసు పోరగాళ్ళ జిమ్మేదారికోయిలా
సత్తువంతసావపట్టె జిమ్మేదారికోయిలా
ఆడివిలున్న ఊరికైన జిమ్మేదారికోయిలా
మూడుకట్టెలాటవచ్చె జిమ్మేదారికోయిలా ॥ఎట్లా॥

నీళ్ళులేని ఊరికైన జిమ్మేదారికోయిలా
నడిసొచ్చే 'కోకకోల' జిమ్మేదారికోయిలా
కొబ్బరి నీళ్ళెటువాయె జిమ్మేదారికోయిలా
చల్లా అంబలి చచ్చే జిమ్మేదారికోయిలా ॥ఎట్లా॥

నట్టనడిమి అడవికైన జిమ్మేదారికోయిలా
నాణ్యమైన సారవచ్చె జిమ్మేదారికోయిలా

అమ్మజోల పాటపాయె జిమ్మేదారికోయిలా
అమెరికోని పాటలొచ్చె జిమ్మేదారికోయిలా ॥ఎట్లా॥

ఒకటిరెండు కూడికలకు జిమ్మేదారికోయిలా
ఓపలేని ఖైదడులాయె జిమ్మేదారికోయిలా
కంప్యూటర్ గుప్పిటిలో జిమ్మేదారికోయిలా
కండ్లుండిన గుడ్డితనం జిమ్మేదారికోయిలా ॥ఎట్లా॥

అప్పులపాలైన ప్రజల జిమ్మేదారికోయిలా
ఆఖరి ఊపిరిమిగిలే జిమ్మేదారికోయిలా
ఆకలిచావుల వెనకా జిమ్మేదారికోయిలా
అమెరికోని నవ్వులాయె జిమ్మేదారికోయిలా ॥ఎట్లా॥

చెట్టుపోయె గుట్టవాయె జిమ్మేదారికోయిలా
చెలిమెలల్ల నీళ్ళు ఇంకె జిమ్మేదారికోయిలా
మనిషి గాలి పీల్చపోతె జిమ్మేదారికోయిలా
ముక్కుమీద హక్కులాయే జిమ్మేదారికోయిలా ॥ఎట్లా॥

అమెరికోడు అర్దరిస్తే జిమ్మేదారికోయిలా
భూమి మీద పుట్టుదాయె జిమ్మేదారికోయిలా
బతుకెగాదు సావుకైన జిమ్మేదారుకోయిలా
గ్లోబల్ సూత్రాలు పెట్టె జిమ్మేదారికోయిలా ॥ఎట్లా॥

## నిస్సార్

# బహుళజాతి పెట్టుబడి

బహుళజాతి పెట్టుబడికి బానిసయ్యే గౌరుమెంటు
ప్రజల ఆస్తులన్నిట్టిని ప్రైవేటోళ్ళకిస్తున్నది. అరె.రె.రె.రె.
ప్రవేటీకరణ పనిపట్టగా రారన్న, దాని పాడెగట్టరన్న. ॥బహుళ॥

గోల్డెన్ షెక్ హ్యాండ్ అంటు గోల్‌మాల్ చేస్తున్రు
లే ఆఫ్ లాకెట్ రిట్రిచ్‌మెంటు అనుకుంటు
కోట్లది కార్మికుల నోట్ల మన్ను బోస్తుండ్రు అరె.రె.రె.రె.
నోటి కాడి బుక్క గుంజి
గద్దలకేస్తుండ్రు వీళ్ళ గద్దె దింపరన్నా.... ॥బహుళ॥

మన వంట్లో అవయవాలు మన కార్పొరేషన్లు
సుబ్రమణ్యం కమిటి సుబ్బరంగా మింగనుంది
మన కంటి చూపులాంటి కరెంటు సంస్థనేమో
హిలేన్ భయ్యా కమిటి కతం జెయ్యచూస్తుంది
టాండన్ కమిటిఏమో రైల్వే పట్టాలు తప్పి
రామకృష్ణరావు కమిటి చదువుకెసరు బెడుతుంది
ఇరిగేషన్ సంస్థలోని వేలాది ఉద్యోగుల
గంగోపాధ్యాయ కమిటి గంగలో కలుపనుంది అరె.రె.రె.రె
రోజుకొక్క కమిటిబెట్టి మనల ముంచిరన్నా
ఎదిరించి నడువరన్నా ॥బహుళ॥

చెమట నెత్తురుకందలు ఎముకలు ఎదురూబెట్టి
ఏర్చి పేర్చి కట్టుకున్న పబ్లిక్ సెక్టార్లన్ని
బహుళజాతి కంపెనీలు బుక్కబెట్ట జూస్తున్నయ్ ఆరె.రె.రె.రె
బుక్క పెట్టి బహుళజాతి మక్కెలిరగదన్నా
మన మొక్కటవ్వాలన్నా ॥బహుళ॥

నష్టాల్లో నష్టమంటూ ఇల్లెక్కి కూస్తుంద్రు
గౌరు మెంటోడు మనల బదనాము జేస్తందు
నష్టాలకు కారకులు ఏలెటొల్లెరన్నా
వీళ్ళ ఎంటబడాలన్న ॥2॥

పిడుగు ఎంకన్న

# అన్నదాత ఆత్మహత్యలు

అన్నదాతలు - మా రైతన్నలు
ఆత్మహత్యల - పాలాయెనా! .... ॥అన్న॥

ఏరువాక వచ్చి తొలకరి కురువంగా
పొలము సాగుచేసి విత్తనాలు చల్లి
పెట్టుబడులుపెట్టి మొక్క మొక్క పెంచి
పైరు పచ్చగా పెరిగి పంట చేతికిరాగా
అప్పులోడు వచ్చి ఎత్తుకెళ్ళేనా!
అన్నదాతకు వట్టి మన్ను మిగిలేనా!!.... ॥అన్న॥

గంపెడాశతో పట్టణానికి వెళ్ళి
పత్తిగింజలు తెచ్చి పొలములోన విత్తి
అందిన చోటల్ల అప్పులెన్నోతెచ్చి
మందులెన్నోవేసి చెట్టు, పైచెట్టు పెంచి
పురుగు మందుల కల్తి పుట్టి ముంచిందా!
దోమకాటుకు చేను బీడుపోయిందా!!.... ॥అన్న॥

అంగట్లో తెచ్చిన అప్పులపైన
వడ్డీలమీద వడ్డీలు పెరిగె
గుట్టుగా బతికేటి రైతన్నలనూ
అప్పులోడు వచ్చి పరువునే తీయంగా
అత్మగౌరవం మంటగలిసెననీ!
ఆత్మహత్యలకు పాల్పడినారా!!... ॥అన్న॥

ఆంధ్రదేశంలోన ఏ జిల్లా కెళ్ళినా
ఏ పల్లెకెళ్ళినా రైతన్న చావులే
సోనియా వచ్చింది సోకాలు పెట్టింది.
చంద్రబాబువచ్చి చెక్కుల్నె పంచిండు
ఎవరు వచ్చి ఏమి చేసింది లేదు!
ఆత్మహత్యలను ఆపిందిలేదు!!.... ॥అన్న॥

ఆత్మహత్య నీకు దారికాదన్న
పీడకుల పాలన ఎదిరించరన్నా
బతికుండి బరిలోన నిలువాలిరన్నా
కపట పాలకులను పారద్రోలన్న
దోచేటి దొంగలను తరుమన్నా!
నువ్వు పోరుదారిలోన నడువన్నా!!

సదాశివుడు

# హైటెక్ మాయలేడి

హైటిక్కు మాయలేడిరో
దీని ఒళ్ళంతా పైడిపూతరో....
ఊళ్ళల్లో కొచ్చింది మాయతెరలుదించింది
మన దారిని మళ్ళించే మారీచుని మంత్రమిది ॥హైటిక్కు॥

విదేశీ రుణదాతల ఖజానాల్లో పుట్టింది
సర్కారీ తోటల్లో మేసి బాగ బలిసింది
బడాబడా ధనస్వాముల దోస్తానా చేసింది
నగరాలను వాళ్ళకొరకు నజరానా ఇచ్చింది ॥హైటిక్కు॥

ఎండల్లో పల్లెజనం చల్లను తాగొద్దన్నది
థమ్సప్పులు సేవించి తరించరా బ్రదరన్నది
ఒగ్గు కథలు, బుర్ర కథలు, ప్రజాకళలు వద్దన్నది
టీవీలో అర్ధనగ్న సినిమాలే ముద్దన్నది
ఇంటిమీది యాంటిన్నా! అభ్యుదయం బాటన్నది ॥హైటిక్కు॥

విత్తనాలమీద కూడా పెత్తనము తనదన్నది
తను చెప్పిన విత్తనాలే కొనితీరాలన్నది
మన ఇంటి వేపచెట్టు - అది వీచె చల్లగాలి
అమెరికా పేటంటట హక్కులన్ని తమవేనట
తను చేసె నిర్వాకం జనం కోసమంటున్నది ॥హైటిక్కు॥

ఊరావలి వాడల్లో ఆదివాసి గుడిసెల్లో
జన్మభూమి జై అన్నది - భూమిలేదు పొమ్మన్నది
మిగులు భూమి పంపిణీకి ముహూర్తమే లేదన్నది.

గోదావరి జలాలకు సాగరమే దిక్కన్నది
ఔనన్నా, కాదన్నా తనమాటే రైటన్నది ॥హైటిక్కు॥

తాకట్టులో తెలుగుతల్లి బక్కచిక్కిపోయింది
స్వర్ణాంధ్ర అంటున్నది - చక్కిలిగిలి పెడుతున్నది
పైడిపూత వన్నెచూపి - కంప్యూటరు కండ్లజూపి
మన వేళ్ళతో మన కండ్లే పొడవాలని చూస్తున్నది
॥హైటిక్కు మాయలేడిరో - దీన్ని
గదిమిగదమి తరిమికొట్టరో॥

## జాకబ్

# గొంతు కోస్తున్నారు

ప్రైవేటు ప్రైవేటు ప్రైవేటంటున్నారు
కార్మికుల గొంతుకోయ కత్తినూరుతున్నారు
ప్రజాధనం పాడుబెట్టి కోట్లధనం కూడబెట్ట
అప్పుకింద దేశాన్ని అమ్ముకుతింటున్నారు ॥ప్రైవేటు॥

అంతర్గాం మూతబడే స్పాంజైరన్ చతికిలబడె
నెల్లిమర్ల గుంతకల్లు సిరిసిల్లలు చెల్లిపాయె
ఎగిరిపాయో రామగుండం ఎరువుల ఫ్యాక్టరి అపుడే
నోటికాడ కూడుపోయి - ఆకలి చావులు మిగిలే ॥ప్రైవేటు॥

తవ్వితీసి, రాసిపోసి అందుకొనే ఐశ్వర్యం
భూమితల్లి కడుపులోని సింగరేణి బంగారం
బ్లాకులుగా విడగొట్టి కారుచౌక ధరలుకట్టి
సేట్లు, షావుకార్లకు అప్పనంగ అమ్మబట్రి ॥ప్రైవేటు॥

ప్రగతిపథం అందుకొనగ - వనరులన్ని పోగుపడగ
యల్.ఇ.సి, జి.ఇ.సి, బ్యాంకుల జాతీయకరణ
పరదేశి పెట్టుబడికి పచ్చజెండ ఊపారు
మన దేశపు కష్టజీవి కడుపును కొడుతున్నారు ॥ప్రైవేటు॥

వెలుగుజిమ్మే విద్యుత్తులు ఎన్రాన్‌తో మాసిపాయె
లాభాలతో వర్ధిల్లే బాల్కోకు మబ్బుకమ్మె
ప్రైవేటుపరం ఈ పుణ్యం - ప్రజలకు శాపం కాదా!
ప్రజలకు తగిలిన ఘాతం ప్రైవేటుకు వరం కాదా ॥ప్రైవేటు॥

పబ్లిక్ రంగం పలుచన ప్రైవేటుకు చిక్కదనం
ప్రజలకు ఈ పాలకులు ఇచ్చుకానుకా ఇది
ప్రైవేటుతో ప్రజలబతుకు పటాపంచలాయెనుగా
మదుపుపెట్టి కలిగినోళ్ళు - పిటపిటలాడెనుగా ॥ప్రైవేటు॥

రవిశాస్త్రి

# విషాద గీతం

విశ్వమానవ వీణపైన
విష నిషాదం ధ్వనిస్తుంటే
గీతమా! నీ ఉనికెక్కడ?
సంగీతమా! నీ ఊపిరెక్కడ? ॥విశ్వ॥

మనసు ముంగిటి తోరణాలను
మనిషి స్వార్థం బిగిస్తుంటే
ఆమనీ! ఆగమనమెందుకు?
హేమంతమా! సీమంతమెందుకు? ॥విశ్వ॥

రక్షరేకుల సాములోరే
భక్షణానికి బరితెగిస్తే
శాంతమా! నీ ఊసులెందుకు?
ప్రశాంతమా! నీ బాసలెందుకు? ॥విశ్వ॥

విద్యలే వాణిజ్యమైతే
చదువుభారం చంపుతుంటే
బాల్యమా! నీ లాస్యమెక్కడ?
భావమా! నీ వెదుగుడెక్కడ? ॥విశ్వ॥

చేతి పనులకు వాతబడితే
మరణశయ్యను శరణుజొస్తే
దేశమా! నీ గమనమెచటికి?
సందేశమా! నీ గమ్యమేమిటి? ॥విశ్వ॥

హలంపైనా - కలంపైనా
సకల శ్రామిక జనంపైనా
కూట నీతులు మాటూవేస్తే
పోరాటమా! మోమాటమెందుకు ॥విశ్వ॥

## చైతన్యప్రసాద్

# కాకలు తీరిన కార్మికులారా!

కాకలు తీరిన కార్మికులారా!
కార్మికులారా - కార్మికులారా
కడుపులు మండిన కర్షకులారా!
కర్షకులారా - కర్షకులారా
సాగించండీ పోరాటం - ఇది
ఆగని అంతిమ పోరాటం -శ్రమ
జీవుల విప్లవ పోరాటం....

కలిమి బలిమితో చీకటి శక్తులు
చెలరేగాయీ ఈ వేళ
మరుగుతున్న మన చమట చుక్కలే
మరఫిరంగులై మ్రోగాల
డాలరు రోలరు ముంగిట శవమై
సాగిల బడ్డది సర్కారూ
వంచన నేర్చిన ప్రపంచ బ్యాంకుకు
దేశం తాకట్టెట్టారు... ||కాకలు||

తర తరాల మన ఫ్యాక్టరీలకే
తాళం కప్పలు వేశారు
సిరులు మ్రింగు ప్రైవేటు దొరలకే
దొడ్డితలుపులను తీశారు.
ఒక్కటై సాగు కార్మిక శక్తుల
హక్కుల కుత్తుక కోశారు
సమ్మె నిరసనల వెన్నువిరిచి తమ
కొమ్ములనే ఎగరేశారు ||కాకలు||

లక్షలాది మన నిరుద్యోగులకు
కడుపు నింపగా పనిఏది
కొలువుపోయి నడివీధిన చేరిన
కొత్తవారికిక దిక్కేది!
అమ్మనైన తెగనమ్మ దళారుల
కొమ్ముకాచినది ఈ రాజ్యం
శ్రామికశక్తి - తలలోని యుక్తి - పర
ధనిక స్వాములకు నైవేద్యం ॥కాకలు॥

పరుల సీమలో పండే సరుకును
కారుచౌకగా తెచ్చారు
సస్యశ్యామల దేశపు రైతుకు
చావు పల్లకీ ఇచ్చారు...
గిట్టుబాటు ధర అడిగేవారికి
మొట్టికాయలే వేశారు.
బతకలేని మన బడుగు రైతులకు
పురుగుమందు తాగించారు ॥కాకలు॥

సొంత గడ్డపై సొగసుగా పూచిన
శ్రమ కుసుమాలనూ త్రుంచారు
పరాయి కిరాయి సంస్కరణలనే
తురాయిగా ధరియించారు
అణచబడిన మన కార్మిక, కర్షక
అసంఘటిత జన సందోహం
చావో రేవో తేల్చే సమరం
చేయక తప్పనిదీ సమయం ॥కాకలు॥

త్యాగధనులు తమ నెత్తుట తడిపీ
ఎగరేసినదీ జెండేరా....
ఎర్రజెండా అండగ నిలవగ
తుది సమరానికి దండోరా ॥తుది॥